## భారతప్రభుత్వ సమ్మత దృక్సిద్ధాంత

## 111 సం॥ల భూత వర్తమాన భవిష్యత్

# గుప్తా

# శతాబ్దిపంచాంగము

## 1940 - 41 నుండి 2050-51 వరకు

## విక్రమనామ సంవత్సరమునుండి

## ప్రమోదనామ సంవత్సరము వరకు

శతాబ్ది పంచాంగ కర్త :

శ్రీ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యులు మరియు శ్రీ గణపతి కదిరప్ప గారి శిష్యులు;

దైవజ్ఞరత్న, జ్యోతిషరత్న, జ్యోతిషరత్నాకర, వాస్తుశిఖామణి, అర్షవిజ్ఞాన భాస్కర, జ్యోతిష విద్యాభూషణ బిరుదాంకితులు

మహర్షి ఎడ్యుకేషనల్ ట్రస్టు, విజయవాడవారు 28-08-2005 తేదీన నిర్వహించిన జ్యోతిశాస్త్ర పరిశోధనాశాల పోటీలో ప్రథమ బహుమతి విజేత

**డా॥ చిత్రాల గురుమూర్తి గుప్త సిద్ధాంతి,** అస్ట్రో-వాస్తు పండిట్

**శ్రీకృష్ణా జ్యోతిషాలయము & శ్రీ కృష్ణా జ్యోతిష పరిశోధనాలయము**

డోర్. నెం. 14-214, కమలానగర్, వరుణ్ చిన్నపిల్లల ఆసుపత్రి ఎదురుగా, అనంతపురం - 515001 (ఆం.ప్ర.)

ఫోన్ : 08554 - 241061; సెల్ : 94402 48176, (ఆంధ్ర) 098863 59483 (కర్ణాటక)

సహాయకులు : శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తా సిద్ధాంతి గారి శిష్యులు :

ఎస్. నాగరాజు, కనేకల్ మండల్, అనంతపురం జిల్లా. సెల్ : 9441983869



☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా, కోటగుమ్మం, రాజమండ్రి-1.



వెల : 900-00

WWW.MOHANPUBLICATIONS.COM

# నవగ్రహాధిపత్య దేవతల స్తుతి, స్తోత్రాలు

**గణపతి స్తుతి (బుధగ్రహాధిపత్య దేవుడు)**

సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణికః
లంబోదరశ్చ వికటోవిఘ్నరాజో గణాధిపః
ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననాః
వక్రతుండ శ్శూర్పకర్ణః హేరంబస్కంద పూర్వజః
షోడశైతానినామాని యఃపఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వ కార్యేషు విఘ్నస్తస్య నజాయతే





**శ్రీ సుబ్రహ్మణ్య స్తుతి (రాహుగ్రహాధిపత్యదేవుడు)**

గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం
జ్ఞానశక్తిం కుమారం !
బ్రహ్మణ్యం స్కంద దేవం గుహ మమలగుణం
రుద్రతుజః స్వరూపం !
సేనానిం తారకఘ్నం గురమచలమతిం
కార్తికేయం షడాస్యం !
సుబ్రహ్మణ్యం మయూరధ్వజ రథసహితం
దేవదేవం నమామి !!

**కృష్ణ స్తుతి (గురు గ్రహాధిపత్య దేవుడు)**

శ్రీకృష్ణ నా మనస్సును బుద్ధిని నీలో జేర్చుము నా స్వామి ఓ కరుణాకర వాసుదేవ హర పాడెద ఆడెద శ్రీకృష్ణా కేశవ నారాయణ మాధవా హరే గోవిందాచ్యుత నరసింహ హృషికేశ దామోదర యనుచును పలుకగజేయుము శ్రీకృష్ణా దేహము చేతను వాక్కు చేతను మనో బుద్ధిచేతను ఏయో క్రియలు చేయించదవో శ్రీకృష్ణానీకే అర్పణము





**శివ స్తుతి (శనిగ్రహాధిపత్య దేవుడు)**

వందే శంభు ముమాపతిం సురగురుం
వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం మృగధరం
వందే పశూనాం పతిం
వందే సూర్య శశాంక వహ్నినయం
వందే ముకుంద ప్రియం
వందే భక్త జనాశ్రయించ
వరదం వందే శివం శంకరం

**శ్రీరామ స్తుతి (రవి గ్రహాధిపత్య దేవుడు)**

శ్రీరామం త్రిజగద్గురుం సురవరం
సీతా మనోనాయకం శ్యామాంగం
శశికోటి పూర్ణవదనం చంచత్కళాకౌస్తుభమ్
సౌమ్యం సత్త్వ గుణోత్తమం సుసరయూ తీరే
వసంతం ప్రభుం త్రాతారం సకలార్థ సిద్ధి
సహితం వందే రఘూణాంపతిమ్ ॥





**లక్ష్మీస్తుతి (చంద్ర గ్రహాధిపత్య దేవత)**

లక్ష్మీం క్షీర సముద్ర రాజతనయాం
శ్రీరంగ ధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవ వనితాం
లోకైక దీపాంకురాం
శ్రీమన్మంద కటాక్షలబ్ధ
విభవద్బ్రహ్మేంద్రగంగాధరం
త్వాం త్రైలోక్య కుటుంబనీం సరసిజాం
వందే ముకుంద ప్రియాం

**పార్వతి స్తుతి (శుక్ర గ్రహాధిపత్య దేవత)**

ఓంకార పంజర శుకీం
ఉపనిష దుద్యానకేళి కలకంఠీం
అగమవిపిన మయూరీం అర్యాం
అంత ర్విభావయే గౌరీం



**హనుమాన్ స్తుతి (కుజగ్రహాధిపత్యదేవుడు)**

మనోజపం మారుత తుల్యవేగం
జితేన్ద్రియం బుద్ధిమాతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజమ్ వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి





**గాయత్రీ మంత్రం**
**(నవగ్రహాలకు శక్తిని ప్రసాదించే ఆదిశక్తి)**

ఓం భూర్భువః స్వః తత్స వితుర్వరేణ్యమ్।
భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్ ॥



# గుప్తా శతాబ్ధి పంచాంగముయొక్క గొప్ప తనము

1. భారతప్రభుత్వము 18 భాషలలో ప్రచురిస్తున్న "రాష్ట్రీయ పంచాంగము", ఎన్.సి.లహరి కలకత్తావారి దృగ్గణితము ఈ గణితము ఒక్కటే.
2. భారతదేశపంచాంగ సంస్కరణ కమిటీ ఆమోదించిన గణితం.
3. జ్యోతిషశాస్త్రం సత్యమని రుజువుచేసే గ్రహణసమయాలు ప్రత్యక్షానికి సరిపోయే గణితం.
4. ప్రతి అక్షాంశముమీదకు సూర్యగమనం (sun declaration) ప్రత్యాక్షానికి సరిపోయే గణితం.
5. నక్షత్రశాల (Planetarium) కు సరిపోయే గణితం.
6. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జ్యోతిష ఎం.ఏ. విభాగం హైదరాబాదు వారు ఆమోదించిన గణితం.
7. తూర్పుగోదావరి జిల్లా ర్యాలీ సమీపాన పొడగట్ల పల్లె పిడపర్తి వారి "ఆంధ్రప్రతిక" పంచాంగ గణితము ఈ గణితము ఒక్కటే.
8. సూర్యసిద్ధాంత గ్రంథములో సూర్యభగవానుడు ఈ గణితం కృతయుగమున ఋషులకు ఉపదేశించుచున్నాడు, కలియుగములో కాలగమనంలో గ్రహగతులలో మార్పును దృక్కుకు సరిపోవునట్లు సంస్కరించవలెనని చెప్పినవిధంగా సంస్కరించిన గణితం.

శోభకృత్ నామ సంవత్సరం 1963-64
మార్గశిరమాసం క్షయమాసము
దుందుభి నామ సంవత్సరం 1982-83
మాఘమాసం క్షయమాసము కావున
పంచాంగములో ఆ మాసం సూచించలేదు.
పాఠకులు గమనించగలరు.



రచయిత
చిత్రాల గురుమూర్తి సిద్ధాంతి,
అనంతపురం
సెల్ : 9440248176

# BIBLIOGRAPHY

(The Following Books Have Been Used For Reference For Preparing Of This Gupta Satabdi Panchang)


1. History of the Indian Calendar
   Shri N.C. Lahiri
   Council of Scientific Research, New Delhi, 1993
2. An Indian Ephemeris - A.D. 1800 - A.D. 2000
   L.D. Swamikannu Pillai
   Asian Educational Services, New Delhi
3. Indian Chronology (Solar, Lunar and Planetary)
   A Practical Guide to The Interpretation and Verification of Tithis, Nakshatras and other Indian Time records
   B.C. 1 to A.D. 2000
   L.D. Swamikannu Pillai
4. Astronomy
   Peter Duffet Smith, Cambridge University Press UK
5. The Astronical Almanac for the Year 1993
   Her Majesty's Nautical Almanac Office, UK
6. Planetary and Lunar Coordinates
   Her Majesty's Stationery Office, UK
7. The Star Almanac for the years 1993 & 1994
   Prepared by H.M. Nautical Almanac Office, UK
8. The Indian Astronomical Ephemeris
   Indian Meteorological Dept. Govt. of India
9. Astronomical Phenomena
   Prepared by The Nautical Almanac Office, UK & others
10. MICA Interactive Floppy Almanac
    US Naval Observatory USA
11. Eclipse Predictions by Fred Espenak, NASA/GSFC
12. Report of the Calendar Reform Committee,
    Govt. of India-1955 Pages 101 – 116
13. Canon Of Eclipses
    Prof. Theoder Ritter Von Oppolzer
    Member of the Imperial Acadamy of Science in Vienna
    Dover Publicotions,Inc,New York
14. Fifty Year Canon of Solar Eclipses : 1986-2035
    By Fred Espenak
    Sky Publishing Corporation,Combridge,Massachusetts
15. Canon Of Lunar Eclipses Canon Der Mondfinsternisse
    By Fred Espenak
    NASA Reference Publications 1178 Revised.

# అంకితం

ఈ గ్రంథము నా ఆరాధ్యదైవాలు
గీతాచార్యులు
శ్రీ కృష్ణ భగవాన్,
రఘువంశ రత్నదీపం
శ్రీరామచంద్రమూర్తి
దేవతామూర్తుల పాదపద్మములకు నమస్కరిస్తూ
అంకితమొనర్చుచున్నాను.








కలియుగమున నిత్యం జపించవలసిన మహా మంత్రం



హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ
రామ రామ హరే హరే

# పండితాభిప్రాయం

## పంచాంగ సమీక్షా సారాంశము

"పంచాంగ గణిత కళానిధి" శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తా జ్యోతిర్వాస్తు సిద్ధాన్తి గారు గణించి ప్రచురింపజేసిన ఈ గుప్తా శతాబ్ది (1940-2050) పంచాంగము పూర్తిగా దృక్సిద్ధగణిత నిబద్ధతకలిగి భారతప్రభుత్వ సమ్మత చైత్రపక్ష అయినాంశలను ఉపయోగించి తిథి, నక్షత్రాంశ కాలములు ప్రతిదిన గ్రహనక్షత్ర పాదచారలు, ప్రతిదిన రవ్యాది గ్రహస్ఫుట చారలు, లగ్నభుక్తి, మొదలగు ఉపయుక్తమైన పంచాంగములు గుణించి లిఖించబడినవి.

భూత భవిష్య వర్తమానకాల తెలుగు సంవత్సర పంచాంగ రచనలు చేసి ప్రచురించినవారుగలరు కాని ఆ పంచాంగములో అయినాంశరీత్యా సాధించిన తిథ్యంతకాలాలు, ఈ దృక్సిద్ధాంత పంచాంగముతో ఏకీభవించవు. పంచాంగ గణితజ్ఞులు ఏ అయినాంశ తీసుకున్నను అన్ని అయనాంశరీత్యా కూడా తిథ్యాంతములు ప్రాముఖ్యంగా ఏకీభవించ తీరాలన్న సత్యాన్ని విస్మరించి పంచాంగ రచనలు చేయుచున్నారు. శ్రీ బి.వి.రామన్‌గారు సూర్యసిద్ధాంత అయనాంశరీత్యా పంచాంగములోను, శ్రీ కె.ఎస్. కృష్ణమూర్తిగారి న్యూకూంబ్ అయనాంశరీత్యా సాధించిన పంచాంగములోను, శ్రీ ఎన్.సి. లహరిగారి చైత్రపక్ష అయనాంశరీత్యా సాధించిన పంచాంగములోను, ప్రస్తుత శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తాగారి దృక్సిద్ధాంత పంచాంగములోను ప్రాముఖ్యంగా తిథ్యాంతములు ఒకటిగానే సాధించిబడినవి. ఇందుకు గాను ముఖ్య సూత్రమేమనగా ? సాయనరవి, చంద్రస్ఫుటములలో ఏ అయనాంశములు తీసివేసినను వీరిరువురుమధ్య దూరం మారదుగాన, తప్పక సర్వపంచాంగాల తిథ్యంతము మాత్రము మారకకూడదని ధృవీకరించుచున్నాను. ఈ తిథ్యంత్యాల మార్పువల్ల "చంద్రగ్రహణ" మధ్యకాలము - పౌర్ణమి తిథ్యంతకాలానికి సమానముగా ఉండాలన్న నియమము భంగమగుచున్నది గాన సిద్ధాంతులు ఈ విషయాన్ని గ్రహించాలి.

ఈ గుప్తా శతాబ్ది పంచాంగములో తిథ్యాంత్యాలు, నక్షత్రాంశ కాలములు, రవ్యాది నవగ్రహ నక్షత్ర పాదప్రవేశకాలాలు, రవ్యాది గ్రహస్ఫుట కాలాలు, లగ్నభుక్తితోపాటు వక్ర ఋజుగతులు గణించబడినవి. ఇంకా అనేక ఉపయుక్త విషయాలు ఈ పంచాంగములో పొందుపరచబడినవి. పంచాంగనుసారం మరియు ఎఫెమెరీస్ రీత్యా జాతకచక్రం లిఖించువారి అందరికీ ఎంతో ఉపయుక్తంగా కలదు. 2050 ఎ.డి. వరకు పుష్కర ప్రవేశతేదీలు, పుష్కరములు జరుగు స్థలవివరణ, సూర్యచంద్ర గ్రహణాలు, గురు శుక్ర మౌఢ్యాలు, భారత దేశంలోని అన్ని అక్షాంశములకు, లగ్నప్రమాణములు, సూర్యోదయాలు వ్రాయబడినవి. "లాగరిథమ్స్" పట్టికలను అనుసరించి సర్వ గ్రహాల స్ఫుటాన్ని కావలసిన తేదీ, సమయాలకు కనిపెట్టు విధానము, చైత్రాదిగా సర్వమాసాలలో ప్రాప్తించు హైందవ పర్వదినాలు, పండుగలు వివరాలు, ఒకటననేలా, అనేక నూతన విషయములు పొందుపరచుచూ జాతకచక్రము లిఖించుటకు ఏ ఇతర పుస్తకములు చూడనవసరంలేకుండా సర్వస్వం ఈ పంచాంగములో ఇవ్వబడినది.

శ్రీ చిత్రాల గురుమూర్తిగుప్తా గారు బహుముఖ ప్రజ్ఞాశాలి. నా చిరకాల వాంఛను నా శిష్యులుగా, పరిశోధకునిగా, సలహా ప్రోత్సాహకునిగా, నా శ్రేయోభిలాషిగా, ఈ గుప్తా శతాబ్ది పంచాంగమును సంపూర్ణంగా తీర్చి దిద్దినందులకు, నవగ్రహములు ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రాప్తింప జేయుదురుగాక అని ఆశీర్వదించుచున్నాను.



విద్వజనవిధేయుడు
**గణపతి కదిరప్ప**
జ్యోతిర్వాస్తు సిద్ధాన్తి.
పరాశర జ్యోతిషం, పరాశరజ్యోతిర్వాస్తు శాస్త్రం,
సింపుల్ రెమెడీస్ పుస్తక రచయిత
సెల్ : 9949306941



# పండితాభిప్రాయం



## పంచాంగ సమీక్షా సారాంశము

మిత్రులు, దైవజ్ఞరత్న, జ్యోతిషరత్న, జ్యోతిషరత్నాకర, వాస్తుశిఖామణి, ఆర్ష విజ్ఞానభాస్కర డా॥ చిత్రాల గురుమూర్తి గుప్తా సిద్ధాంతిగార్కి నమస్కారములు. గుప్తా శతాబ్ధిపంచాంగము (1940-2050) మీరు పంపినది అందినది. పండిత లోకము ఆశ్చర్యపోవునట్లు రచించిన ఈ గ్రంథమును గాంచి అమితానందము నొందితిని. ఈ గ్రంథము మీయొక్క పట్టుదల దీక్షదక్షతులకు నిదర్శనము. ఆంధ్రప్రదేశ్‌లోనేగాక ఆ సేతు హిమాచలమునందీ గ్రంథము వంటి గ్రంథము మరొక్కటి లేదనిన, అతిశయోక్తికాజాలదు. ఒక్కసంవత్సర పంచాగ గణనమే యొక ఘనకార్యమగుచుండ శతాదిక సంవత్సర పంచాంగ గణనచేసిన మీ ఘనత ఎంతని చెప్పగలను. అదియును భారత ప్రభుత్వ సమ్మమును దృక్‌సిద్ధమును అయిన శతాబ్ధి పంచాంగము గణించిన అగ్రగణ్యులుగా ఘనకీర్తి సంపాదించితిరి. సంవత్సర అయనాంశగతిన నిర్దుష్టముగా జేయుటలో మీ ప్రజ్ఞ అపారము.

చైత్రాది ఫాల్గుణ పర్యంత హైందవ పండుగలున్ను, ద్వాదశ పుష్కరముల గూర్చిన సంపూర్ణ వివరములున్ను, 2050 వరకు సూర్య చంద్ర గ్రహణములున్ను, గురు శుక్ర మౌఢ్యములున్ను ఈ గ్రంధ విశిష్ఠత నినుమడింపజేసినవి.

భారత దేశములోని అన్ని అక్షాంశములకు సూర్యోదయ, సూర్యాస్తమయ ములు మరియు అన్ని అక్షాంశములకు నిరయన లగ్న ప్రమాణములిచ్చి ఈ పంచాంగమును దేశవ్యాప్తంగా నుపయోగించు సౌకర్యమును కల్పించితిరి. పరాశర సిద్ధాంతరీత్యా శుభులు పాపులు నిర్ణయం ఈ గ్రంథమునకు "లైట్‌హౌస్" వంటిది.

ఇలాంటి గ్రంథములు వ్రాయుటకు భగవంతుడు మీకు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించు గాక.

మీ మిత్రుడు
**వేరే కొండప్ప, బి.ఏ.,**
పూర్వ పరాశరీ పై అపూర్వ వ్యాఖ్యానం, ద్వాదశ భావఫలచంద్రిక,
ఆధునిక ప్రశ్న శాస్త్రము పుస్తక రచయిత
సెల్ : 9912403175

# పండితాభిప్రాయం

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ
త్రిస్వర్ణఘంటా కంకణ గ్రహీత, ద్విశతాధిక ప్రతిష్ఠాచార్య
'త్రికాల జ్ఞాన విభూషణ' బిరుదాంకిత, ఖగోళ జ్యోతిష గణితసిద్ధాంతి
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ ఆస్థాన సిద్ధాంత వర్యులు
సెల్ : 9347032385

మేరు పర్వత శిఖరాగ్రములో 5 తలలు, 10 చేతులతో వేంచేసియున్న "విరోధి" అను పేరు కల్గిన దేవత పూర్ణ ఆశీస్సులు ఇవ్వటంతో, పండితుల చిరకాల స్వప్నం ఫలించింది. గత దశాబ్దాలలో కొంతమందికి జనన సమయాలు, మరణ సమయాలు సరిగ్గా తెలిసినప్పటికీ, ఆ సమయానికి వున్న ఖచ్చిత తిథి, నక్షత్రాలు, ఏమిటో తెలియక తికమకపడే వారందరికీ, శ్రీ విరోధినామసంవత్సర దేవత 111సంవత్సరాల దృక్సిద్ధాంత పంచాంగ కల్పవృక్షాన్ని చిత్రాల వారి చేతులమీదుగా మనకందించటము అనిర్వచనీయము. అద్వితీయము.

సరియైన పితృతిథి తెలియక కొంతమంది బాధపడుతుంటే, మరికొందరు జన్మనక్షత్ర విషయంలో.. ఆ నక్షత్రంలో జన్మించామా? ....ఈ నక్షత్రంలో జన్మించామా?.....ఈ రాశిఫలితం చూసుకోవాలా ?......ఆ రాశి ఫలితం చూసుకోవాలా ? అనే సందిగ్ధంలో వుంటే.... ఇంకొందరు అక్షరాభ్యాసం నుంచి వివాహాది శుభకార్యముల వరకు సరికాని, సరిపోని నక్షత్రాలతో కార్యాదులు ఆచరించి తదనంతరము వ్యధనొందే ప్రజలందరికీ 111 సంవత్సరాల కవిల, అన్నిగ్రహాలకు సంస్కారం చేస్తారు. దృగ్గణిత పంచాంగ కర్తలు. మరి పూర్వగణిత పంచాంగకర్తలు మాత్రం సూర్యచంద్రులను వదిలి కుజాది పంచగ్రహాలకే దృక్సంస్కారాలు చేస్తారు. ఇలా చేసినప్పటికీ పూర్వగణిత పంచాంగాలు సత్యనిరూపణకు నిలబడలేకపోతున్నవి. అంటే...నవీన వేధశాల పరిశీలనకు సరిపోలటంలేదు.

సూర్యచంద్ర గ్రహణ సమయాలలో 'ఏకభవిస్తు' నవీన వేధశాలల ప్రత్యక్ష పరిశీలనకు సరిపోల్చుచూ కంటికి (దృక్కు) ప్రత్యక్ష ప్రామాణికంగా నిలుస్తున్నాయి గనుక దృక్సిద్ధాంత పంచాంగాలే సరియైనవి. శాస్త్రీయమైనవి. నిత్యనైమిత్తిక కామ్య కర్మలను ఆచరించుటకు అనువైనవి. "కాలమాధవీయం" స్పష్టం చేస్తుంది.

ఏ గ్రామము కానీ, పట్టణము మీదగానీ నడినెత్తిన సూర్యుడు మిట్ట మధ్యాహ్నకాలమున ఏ తేదీనాడు ప్రాప్తించునది (Sun Declaration) సాధించి ప్రత్యక్షంగా చూపెట్టినటువంటి ఎన్.సి. లాహిరిగారి అయనాంశరీత్యా గణించిన పంచాంగము సత్య నిరూపణకు నేటికి నూరుశాతము ఋజువగుచున్నది. ఇట్టి దృగ్గణిత పంచాంగ గణితముతో 111 సంవత్సరాల భూత వర్తమాన భవిష్యత్ పంచాంగమును మిత్రులు, శ్రేయోభిలాషులు, సమకాలీన పరిశోధకులైన డాక్టర్ చిత్రాల గురుమూర్తి గుప్త గారికి హృదయపూర్వక శుభాభినందనలు. ఇంతకాలానికి పాఠకుల చేతిలో సరియైన సక్రమమైన, సవివరమైన సకౌతుకతతో కూడిన ఖచ్చిత శాస్త్రీయ దృగ్గణిత పంచాంగం వుండటము నాకెంతో గర్వకారణంగా వుంది. చిత్రాల గురుమూర్తి గుప్తాగారు ఇంకా ఇంకా శాస్త్రాధ్యయనం చేసి, బహుముఖ ప్రజ్ఞాపాటవాలతో మరిన్ని జ్యోతిష గ్రంథాలను రచించాలని, భారదేశ వ్యాప్తంగా దృగ్గణిత పంచాంగం రాజ్యమేలేలా చేసే కృషిలో కూడా భాగస్వాములు కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

ఇంతకాలం తరువాతనైనా తిథి నక్షత్ర సమయాలతో వున్న 111 సంవత్సరాల దృగ్గణిత పంచాంగాన్ని పాఠకలోకానికి అందించిన మోహన్ పబ్లికేషన్స్ వారికి నా ధన్యవాదములు తెలియజేస్తున్నాను. పండితులందరూ హృదయపూర్వకంగా అభిమానంతో ఆదరించి ఈ పంచాంగ గ్రంథాన్ని అక్కున చేర్చుకుంటారని ఆశిస్తూ....

మీ
- శ్రీనివాస గార్గేయ



# ఆంధ్రప్రదేశ్‌లో వున్న దృక్సిద్ధాంత పంచాంగ కర్తలు

1. శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ (కాలచక్రం/గ్రహభూమి పంచాంగాలు) - హైదరాబాద్
2. శ్రీ పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి (పిడపర్తి పంచాంగం) - పొడగట్లపల్లి
3. శ్రీ గుడి సోమనాధ శర్మ (ఆంధ్రభూమి పంచాంగం) - హైదరాబాద్
4. శ్రీ గోరస వీరభద్రాచార్యులు - హైదరాబాద్
5. శ్రీ హనుమంతవఝల సుబ్రహ్మణ్యశర్మ - పెద్దాపురం
6. శ్రీ బిజమళ్ల బిందుమాధవ శర్మ - హైదరాబాద్
7. శ్రీ ములుగు రామలింగేశ్వర వరప్రసాద్ - హైదరాబాద్
8. డాక్టర్ వి.బి.యస్. శర్మ - వరంగల్లు
9. చిరంజీవి నందినీ గార్గేయ (శ్రీచక్ర పంచాంగం) - హైదరాబాద్
10. శ్రీ బిట్రా కోటేశ్వరరావు - వేటపాలెం
11. శ్రీ యుగంధర్ సిద్ధాంతి - హన్మకొండ
12. శ్రీ గొర్తి మాచర సుబ్రహ్మణ్య పట్టాభిశాస్త్రి - అమలాపురం
13. శ్రీ ద్విభాష్యం సుబ్రహ్మణ్య శర్మ - అన్నవరం
14. శ్రీ నిత్య నిర్మలానంద యోగేశ్వర సిద్ధాంతి - వరంగల్లు
15. శ్రీ మేడికొండూరు విశ్వనాధ ప్రసాద్ - హైదరాబాద్
16. శ్రీ బళ్ళావఝల శ్రీరామకృష్ణ శర్మ - తాడేపల్లిగూడెం
17. శ్రీ పిచ్చుక గిరిరాజ సిద్ధాంతి - పెద్దాపురం
18. డాక్టర్ సోమవరపు రామలింగయ్య - నల్గొండ
19. శ్రీ శిష్ట్లా ఉమామహేశ్వర శర్మ - శ్రీకాకుళం
20. శ్రీ ఉపద్రష్ట కృష్ణమూర్తి - అమలాపురం
21. శ్రీ కారుపర్తి నాగమల్లేశ్వరరావు - పుట్లేటికుర్రు
22. శ్రీ కారుపర్తి చంద్రరావు - జగన్నపేట
23. శ్రీ అనపర్తి కృష్ణశర్మ - హైదరాబాద్
24. శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తా (గుప్తాపంచాంగం) - అనంతపురం



ఓం శ్రీరామ శ్రీమాత్రే నమః
శ్రీరస్తు



# శ్రీరామ జ్యోతిషాలయం

శుభమస్తు **SRI RAMA JYOTHISHALAYAM** కల్యాణమస్తు

Jathaka, Prasana, Muhurta, Vassthu & Palmistry

**జాతక, ప్రశ్న, ముహూర్త, వాస్తు, సాముద్రిక, పంచాంగం**

**P. SITHARAMA SASTRY,**
ASTRO-PALMIST

**శ్రీ రవిర్జయతే**
**శ్రీలక్ష్మీగణపతయే నమః**
**చిరాయురస్తు**

SOMESWARAM
**సోమేశ్వరం - 533 261**
(Via) Rajahmundry
East Godavari District
Cell : 9247760226

Date......................................

ఆశీర్వాదము

శ్రీయుత చిత్రాల గురుమూర్తి సిద్ధాంతిగారు నాకు సుపరిచితులు. వీరు వ్రాసిన "111సం॥రముల గుప్తా శతాబ్ధి పంచాంగము" శ్రీ పిడపర్తి చిన సుబ్రహ్మణ్యశాస్త్రి (లోగడ ఆంధ్రపత్రిక వారు ప్రచురించే పంచాంగకర్త) సిద్ధాంతిగారి పంచాంగము నకును, ప్రస్తుతము ప్రచారములో కంప్యూటరు జాతకములకును సరిపోవును. ఈ గ్రంథము జ్యోతిషము చెప్పచూ జాతకములు వ్రాయు వారల కెంతో ఉపయోగించగలదు. కావున ఈ రకమగు గ్రంథము ప్రచారములోనికి తీసుకువచ్చి ప్రజలకు యోగకాల కాగలదని ఆశిస్తూ శ్రీ సిద్ధాంతిగార్ని ఆశీర్వదించు చుంటిని.

ఇట్లు
దైవజ్ఞరత్న

పిడపర్తి సీతారామశాస్త్రి సిద్ధాన్తి

(పిడపర్తి సీతారామశాస్త్రి సిద్ధాన్తి)

# *Dr. C.V.B. Subrahmanyam,*

M.A., (Tel) M.A., (Skt) Ph.D.,

Dept. of Astrology
P.S. Telugu University
Public Garden, Hyderabad - 001



Sai Jyothirvaidyalayam
Res : Flat No. 101, Swati Kuteer
Yousuf Guda Buad Stop
Hyderabad - 045, ☎ : 23724999



శ్రీ చిత్రాల గురుమూర్తి గుప్తా సిద్ధాంతి గార్కి నమస్సులు..

మీరు అత్యధిక శ్రమచేసి కూర్చిన 111 సం॥ల గుప్తాశతాబ్ది పంచాంగం చూసినాను. మీరు చేసిన కృషి ప్రశంసనీయం. దృగ్గణిత ప్రామాణిక పంచాంగం అందించినందు వలన పలువురు చాలా మంచి ప్రయోజనాన్ని పొందగలగుతారు.

ప్రస్తుత కాలములో జాతక చక్రములు వేయుటకు, వివాహ పొంతనములు సరిచూసుకొనుటకు పాత దృగ్గణిత పంచాంగములు లభ్యంగాక చాలా ఇబ్బంది పడుతున్నారు. ఇప్పుడు ఈ గుప్తా శతాబ్ది పంచాంగంలో దృగ్గణితం ముద్రణ కావడం వల్ల ఆ ఇబ్బంది తొలగి పలువురకు ఉపయుక్తమైనదిగా ఉంది.

భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యాలనిచ్చి ఇటువంటి మంచి పనులు తమ ద్వారా లోకానికి చేయించాలని కోరుతున్నాను.



మీ

**సి.వి.బి. సుబ్రహ్మణ్యం**

Visiting Prof. **ASTROLOGY AND INDUSTRIAL VASTHU**
**Maharshi vedik university,** Holland & U.S.A .



'జ్యోతిష మహార్ణవ', 'వాస్తు సమ్రాట్'
25సం॥రాల 'భవిష్య పంచాంగకర్త'
'దైవజ్ఞ' **గోరస వీరభద్రాచార్యులు**
శాఖాధిపతి, జ్యోతిషశాఖ
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, **హైదరాబాద్ - 4.**

గుప్తా శతాబ్ది 111వ సంవత్సరాల పంచాంగము 1940 నుండి 2050 వరకు అమూలాగ్రంగా చూడడం జరిగింది, జ్యోతిష విద్యార్థులకు ఉపయుక్తమగు రీతిలో పంచాంగ రచన సాగింది. తిథి, వార, నక్షత్రముల సంపూర్ణ విశ్లేషణ, దృగ్గణిత రీత్యా గ్రహస్ఫుటం ఎంతో ఉపయుక్తకరంగా ఉన్నాయి. గ్రహాల వక్ర ఋజుగతులు యివ్వడం వలన జాతకాలు వేసే వారికి సరైన అవగాహన రావడానికి అవకాశం ఏర్పడింది. వివిధ అయనాంశ పట్టికలు, లగ్నాంతకాలపట్టికలు విపులంగా ఇవ్వబడినవి. ఈ సంకలన గ్రంథం జ్యోతిష విద్యార్థులకు అత్యంత ఉపయోగంగా ఉంటుందని ఆశిస్తున్నాను. ఈ గ్రంథాన్ని పాఠకలోకానికి అందిస్తున్న "మోహన్ పబ్లికేషన్స్" వారు అభినందనీయులు.



భవదీయులు

(గోరస వీరభద్రాచార్యులు)



"కాకినాడ శ్రీ నేమాని పంచాంగకర్తలు"

# శ్రీ సరస్వతి జ్యోతిషాలయం

దేవాలయం వీధి, కాకినాడ - 1.

శ్రీ చిత్రాల గురుమూర్తి సిద్ధాంతి గారిచే రచించబడిన ఈ గుప్తా శతాబ్ధి 111సంవత్సరాల పంచాంగం మమ్ములను ఎంతో ఆకర్షించింది. ఇందులో రాశి, అంశ, అర్కడాది చక్రములు, దశాశేషములు ఎవరి చక్రములు వారే స్వయంగా కట్టి తెలుసుకొనుటకు చాలా సులభ పద్ధతిలో తయారు చేసినారు. కొద్దిపాటి జ్యోతిష విజ్ఞానము తెలిసినవారు కూడా ఈ పుస్తకము చూచుట వలన, వారు పుట్టిన తేది, సమయములను బట్టి గ్రహములయొక్క స్థితిగతులు ఏ విధముగా ఉన్నది అవగాహన కలుగును. జాతక చక్రము వేయుటకు కావలసిన ముఖ్య విషయాలు ఈ పుస్తకములో పొందుపరుబడినవి. ఎవరంతట వారు సులభముగా చక్రమువేసి, వారికి ప్రస్తుతము జరుగుచున్న దశాంతర్దశలు తెలుసుకొనవచ్చును.

పాత పంచాంగముల యొక్క అవసరము లేకుండా ఈ దృగ్గణిత పంచాంగం ద్వారా భూత, వర్తమాన, భవిష్యత్ సంవత్సరములలో జన్మించిన వారి యొక్క జాతక చక్రము కూడా తెలిసికొనవచ్చును.

జ్యోతిషాభిమానులు, పండితులు ఈ గుప్తా శతాబ్ధి పంచాంగం తమయొక్క గ్రంథాలయములో యుంచుకొనుట వలన చాలా ఉపయుక్తమగును.

ఇంకా జ్యోతిషశాస్త్రంలో విశేష కృషిచేసి, గ్రంథరచనలు చేసిన వారి యొక్క పుస్తకములు ప్రింటుచేసి, జ్యోతిషశాస్త్రాభివృద్ధికి మోహన్ పబ్లికేషన్స్ వారు తోడ్పడవలెనని మా కోరిక.



ఇట్లు
దైవజ్ఞ రత్న
నేమాని సూర్యనారాయణ సిద్ధాంతి
నేమాని అనంత పద్మనాభ సిద్ధాంతి
నేమాని వీరవేంకట సోమేశ్వరశర్మ సిద్ధాంతి బి.ఎ.బి.ఎల్.,

# విషయసూచిక

# తొలిపలుకులు

## పాఠకదేవుళ్ళకు అనంతకోటి వందనములు

"పురుషులందు పుణ్యపురుషులువేరయా" అన్నట్లు సిద్ధాంత భాగమునందు దృగ్గణితము అత్యుత్తమమైనది.

కేశవ పండితులు సూర్య ఆర్యభట్ట సిద్ధాంతములకు తుల్యముగా తాత్కాల దృగ్యోగ్యముగా "గ్రహకౌతుకం" అను కరణ గ్రంధమొక దానిని రచించెను. రచించిన 60 సంవత్సరములకే గ్రహములు దృక్సామ్యమునకు భేదించి యుండుట చూచి తన పుత్రుడగు గణేశ పండితుడు ఆ గ్రహముల భేదములను సవరించి ఆ కాలమునకు దృక్సూత్రమునకు సరివచ్చునట్లుగా "గ్రహలాఘవము" అను కరణ గ్రంధమును రచించినట్లు తన గ్రంధమునందే చెప్పియుండుటచే దృక్ సిద్ధాంతము యెల్లరిచే అంగీకరించబడినది.

వరాహార్యభటబ్రహ్మగుప్త భాస్కరాచార్యాది సిద్ధాంత కర్తలందరును ఒకరువ్రాసిన సిద్ధాంత శాస్త్రమును మరి ఒక్కరు నలికాది యంత్రములచే పరిశీలించి ఆ కాలమునకు గ్రహములందు గల భేదములను సంస్కరించి నూతన సిద్ధాంత గ్రంథముల రచించి భవిష్యత్తున వరాహార్యభటబ్రహ్మగుప్తల వంటి మహాత్ములు జనించి మేము వ్రాసిన గ్రంథము ప్రకారము తేబడిన గ్రహములందుగల గతిభేదములను సంస్కరించి నూతన గ్రంథములను రచింతురుగాక అని తమ గ్రంథములందు చెప్పబడి యుండుటచే దృగ్గణితమే శ్రేష్ఠమైనది.

**1. శ్లో॥ సంసాధ్య సృష్టతరం బీజం నలికాది యంత్రేభ్యః తత్సంస్కృతాస్తు**
**సర్వే పక్షాః సామ్యభజంత్యేవ॥**

తా. నలికాబంధనాది యంత్రములవలన బీజమును స్ఫుటముగా సాధించి గ్రహములందు సంస్కరించిన యెడల అన్ని పక్షముల గ్రహమును దృక్సామ్యము పొందుచున్నవి అని చెప్పియుండుటచే దృక్సింతమే సర్వసిద్ధాంత జన సమ్మతము కావున తిథ్యాదులకును, జాతకాదులకును దృగ్గణిత సిద్ధాంతమే ఉత్తమమైనది.

**2. శ్లో॥ భగవన్ మృదుచల పాతాః కింప్రయోజనం తేషాం ।**
**దృక్తృతాంతు యాతాఃకథ మిహభవంతి సంస్పషాః॥**

తా. ఓ భగవత్స్వరూపుడైన వశిష్ఠమహామునీ మందోచ్చలు, పాతలు ఏ రూపములో నున్నవి. వాటియొక్క ప్రయోజనమేమి? సూత్రమునకు సరివచ్చిన గ్రహములు ఎట్లు స్ఫుటగ్రహములగుచున్నవి అని వామదేవ మహర్షి వృద్ధ వశిష్ట సిద్ధాంతమందు ప్రశ్నించియున్నాడు. కావున దృక్సిద్ధాంతమే సర్వజనులు అంగీకరించదగినది. పూర్వకాలమునుండియు ఎల్లరకూ దృక్సిద్ధాంతమే అంగీకారముగా ఉన్నది.

**3. శ్లో॥ యాంతి సంసాధితాః ఖేటాయేన దృగ్గణితైక్యకం ।**
**తేన పక్షేణతేకార్య స్ఫుటాస్తత్సమయోద్భవాః॥**

తా. ఏ పక్షముచే సాధించిబడిన గ్రహములు దృష్టిసూత్రమునకు సరిపుచ్చుచున్నవో ఆ పక్ష ప్రకారము స్ఫుటగ్రహములుచేయదగినవి అని దామోదర పద్ధతియందు చెప్పబడిన ప్రకారము దృగ్గణితమునే అంగీకరించవలెను. దృగ్గణితమే ప్రత్యక్షనిదర్శనము.

**4. శ్లో॥ అప్రత్యక్షాణిశాస్త్రాణి వివాదాస్తేషు కేవలం ।**
**ప్రత్యక్షం జ్యోతిష్యం శాస్త్రచంద్రార్కౌత్ర సాక్షిణౌ ॥**

తా. జ్యోతిశాస్త్రము ప్రత్యక్షమనియు, ఆ విషయమై సూర్యచంద్రులే సాక్షులనియు చెప్పబడి యున్నది. దృగ్గణితం ప్రకారం గ్రహములు సాధింపకున్న సూర్యచంద్ర గ్రహణములు గ్రహ, నక్షత్ర, యోగములు గణిత కాలమునకు సరిరాకుండుటవలన జ్యోతిశాస్త్రము ప్రత్యక్ష శాస్త్రమనుటకు వీలులేదు కావున దృగ్గణిత పంచాంగములనే ఎల్లరును ఆదరించవలెను.

**5. శ్లో॥ శాస్త్రమాధ్యం తదేవేదం యాత్పూర్వం ప్రాహభాస్కరః యుగానాం**
**పరివర్తన కాలభేదోత్రకేవలః**

తా. పూర్వము సూర్యుడు జ్యోతిశాస్త్రమును ఋషులకు ఉపదేశించి అనేక యుగములు గడిచియుండుట వలన గ్రహగణితమునందు కాలభేదము కల్గుచున్నది కావున వర్తమానయుగమునకు అనుగుణ్యముగా గ్రహగణితములందు కాలభేదము కల్గుచున్నది. కావున వర్తమాన యుగమున కనుగుణ్యముగా గ్రహగతులందు కాలభేదము రాకుండునట్లు జ్యోతిశాస్త్రము చెప్పుచున్నాను. అని సూర్యసిద్ధాంతమునందు చెప్పబడియున్నది కావున కాలభేదము రాకుండునట్లు సంస్కరించి గుణింపబడిన దృగ్గణిత పంచాంగమే సర్వోత్తమము.

**6. శ్లో॥ పూర్వాచార్యమతేభ్యోయద్యత్ శ్రేష్ఠం లఘుస్ఫుటం బీజం ।**
**తత్తదిహో వికలమహం రహస్య మభ్యుద్యతో వక్తుం ॥**

తా. పూర్వాచార్యుల మతం ప్రకారం ఏ బీజం చేర్చిన గ్రహము దృక్సూత్రమునకు సరివచ్చుచున్నవో అట్టి స్ఫుటబీజమును చెప్పుచున్నానని వరాహమిహిరాచార్యులు చెప్పియుండుటచే దృగ్గణిత సిద్ధాంతమే న్యాయమైనది. కావున దృగ్గణిత పంచాంగములనే సర్వజనులు చూడదగినది.

**7. శ్లో॥ తత్తద్గతి వశాన్నిత్యం యథాదృక్తులతాం గ్రహాః**
**ప్రయాంతి తత్ర్ప వక్ష్యామి స్ఫుటీకరణ మాదరాత్ ॥**

తా. శీఘ్రము, మందము, వక్రము మొదలగు గతులననుసరించి గ్రహములు దృష్టి సూత్రమునకు సరివచ్చునట్లుగా స్ఫుటీకరణము చెప్పి యున్నారు అని సూర్యసిద్ధాంత ద్వితీయ అధ్యాయమునందు 14వ శ్లోకమున చెప్పబడియున్నది. కావున పూర్వ సిద్ధాంత కర్తల అభిప్రాయానుసారం ప్రత్యక్ష ప్రమాణముతో కూడిన దృక్సిద్ధాంతమే ప్రమాణ సిద్ధమగుచున్నది. నిత్య నైమిత్తికాది సమస్త కర్మలకు దృగ్గణిత సిద్ధాంతమే శ్రేష్ఠమైనది.

**8. శ్లో॥ యస్మిన్ పక్షే యత్రకాలేయేన దృగ్గణితైక్యకం ।**
**దృశ్యతే యేన పక్షేణ కూర్యాత్తిథ్యాది నిర్ణయః॥**

తా. ఏకాలమునందు ఏ గణితము శాస్త్రము ప్రకారము గ్రహములు దృక్సూత్రమునకు సరివచ్చునో ఆ గణిత శాస్త్రము ప్రకారము తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను పంచాంగములను రచించవలెను. అని వశిష్ఠ మహర్షి శాసించియుండుటచే "దృగ్గణితము" శాస్త్ర సమ్మతమనియు పురాతనాగతమనియు తెలియుచున్నది. కావున దృక్సింద్ధాంతమే శ్రేష్ఠాది శ్రేష్ఠమైనది.

నవీన ఖగోళ శాస్త్రవేత్త శ్రీ ఎన్.సి.లహరి అష్ట్రో రీసర్చు బ్యూరో కలకత్తావారు మన భారతదేశ పంచాంగ సంస్కరణ కమిటి అధ్యక్షుడు దృగ్గణితమును చిత్రపక్ష అయనాంశగా సంస్కరించి ప్రత్యక్ష నిదర్శనమైన గ్రహములద్వారా దృగ్గణితము సత్యమని నిరూపించెను. కావున దృగ్గణితమే ఉత్తమోత్తమమైనదిగా సర్వజనులు గ్రహించవలయును.

111 సం॥ శతాబ్దిపంచాంగమునందు తిథి, నక్షత్ర, అంత్యకాలాన్ని గ్రహప్రవేశ నక్షత్ర ప్రారంభకాలాన్ని, చంద్రుడురాశిమారునపుడు రాశిచక్రాలు, ప్రతిదిన రవ్యాదిగ్రహస్ఫుటాలు, గ్రహవక్రఋజుగతి ప్రారంభ అంత్యకాలాలను, గురు శుక్ర గ్రహమౌఢ్య ప్రారంభ అంత్య తేదీలను అన్ని ప్రాంతములకు సూర్యోదయ సూర్యాస్తమయములను, రాజమండ్రి ప్రాంతమునకు లగ్నభుక్తిని, ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలు భారతదేశ ముఖ్యపట్టణములకు రాజమండ్రి లగ్నఅంత్యకాలములకు ఉపయోగించి సంస్కారపట్టికను, రాజమండ్రి ప్రాంతమునకు లీఫ్ సంవత్సరము, మామూలు సంవత్సరములకు ప్రతిదినము జనవరి 1వ తేది నుండి డిశంబరు 31వ తేదివరకు లగ్నఅంత్యపట్టికలు, భారతదేశ అన్ని అక్షాంశములకు జనవరి 1వతేది నుండి డిశంబర్ 31వ తేది వరకు ప్రతిదిన సూర్యోదయములు, స్థానిక కాలమునందున్న సూర్యోదయములు ఐ.ఎస్.టి. లోనికి మార్చుకొనుటకు, ఆ ప్రదేశ ఎల్.ఎమ్.టి. మరియు ఆ ప్రదేశ అక్షాంశ, రేఖాంశ సంఖ్యలను వివరించబడినది. నవగ్రహకారకత్వ సమాచారపట్టిక, నవగ్రహశాంతి విధానము, పరాశర పద్ధతిలో శుభులు, పాపుల నిర్ణంకూడ వివరించబడినవి. అయనాంశసూత్రాలు కూడ వివరించబడినది.దశా,అంతర్దాశా, విదశా పట్టికలుకూడ వివరించబడినవి. అన్ని అక్షాంశములకు నిరయణ లగ్నప్రమాణములను వివరించబడినవి. 2050 వరకు సూర్యచంద్ర గ్రహణాలు, పుష్కరతేదీలు, పుష్కరాలుజరుగుస్థలముగూర్చి సంపూర్ణ వివరణ తెలిపితిని.

గ్రహస్ఫుటం చిత్రపక్ష అయనాంశ (లహరి అయనాంశ) రీత్యా ఉదయం 5 గంల 30 నిమిషములకు వివరించబడినది.

ఉదాహరణ జాతకములో లగ్నస్ఫుటం రాజమండ్రి ప్రాంతమునకు ఇతర ప్రదేశములకు సాధించు విధానము వివరించితిని.

ఈ పంచాంగ రచనలో నాకు సహాయ సహకారాలు అందించిన శిష్యుడు ఎస్.నాగరాజు, కనేకల్ (మండల్) అనంతపురంజిల్లా గారికి, ఈ పంచాంగ రచనలో అడుగడుగునా నన్ను ప్రోత్సహించి ఈ గ్రంథము పాఠకలోకము చేరుటకు నాకు ఎంతో సహాయ సహకారాలు అందించి నాకీర్తి శతాబ్ది దృక్సిద్ధాంత పంచాంగకర్తగా దిశదిశలా వ్యాప్తిచెందాలని ఆరాటపడి తనవిలువైన కాలాన్ని నాకోసం ఎన్నో సందర్భాలలో వెచ్చించిన సురేష్ సిద్ధాంతి (వాస్తు శాస్త్రజ్ఞులు) గారికి నేనుఎంతో ఋణపడివున్నాను. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుతున్నాను. ఈ పుస్తకాన్ని పాఠకలోకానికి అందించిన మోహన్ పబ్లికేషన్స్ అధినేత శ్రీ ఆకుల రామచంద్రరావుగారికి ప్రత్యేక అభినందనలు తెలియజేస్తున్నాను.

సర్వసిద్ధాంత భాగమంతయు పాఠకదేవుళ్ళ ఉపయోగార్థం వివరించబడినది. పాఠకదేవుళ్ళు నా ప్రయత్నాన్ని ఆదరించి అభిమానింతురని విశ్వశిస్తున్నాను.

ఇట్లు
మీ రచయిత
**చిత్రాల గురుమూర్తి గుప్తా సిద్ధాంతి**
**అనంతపురం.**



# సిద్ధాంత జాతక భాగములందు దృక్ సిద్ధాంత ప్రాధాన్యత

భూమి తన చుట్టూ తాను తిరగడం, సూర్యుని చుట్టూ తిరగడం ఈ రెండు చలనాలే కాకుండా భూఅక్ష చలనం మూడవ చలనం కలదు. దీనినే విషువ చలనం అంటారు. భూమి ఇరుసు స్థిరంగా లేకుండా చాలా నెమ్మదిగా వలయాల చుట్టును, ఈ వలయం $360^{\circ}$ వృత్తం పూర్తి అవుటకు 25,800 సంవత్సరములు పట్టును. ఒక డిగ్రీ పూర్తి అవుటకు 72 సంవత్సరములు పట్టును. సంవత్సర కాలములో దీని చలనం సుమారుగా 51 సెకన్లు, ఈ గతినే ఆయనాంశ అందురు. నిరయన సిద్ధాంతములో ఆయానాంశ ప్రాధాన్యత సరియైనదే. కాని నేడు ఎన్నో అయనాంశలు ఆచరణలో ఉన్నాయి. ఏది సత్యమో నిరూపించేది గ్రహణాలే ప్రత్యక్షనిదర్శనాలు. గ్రహణాధ్యాయములో గ్రహణ మధ్య కాలము తిథి అంత్యకాలము ఇంచుమించుగా సరిపోవాలనే సూత్రము ఉన్నది. మన పెద్దలు ఈ సూత్రాన్నే ఒకే మాటగా ఈ విధంగా చెప్పారు. గ్రహణమందు పౌర్ణమికి పట్టు పాడ్యమికి విడువు అన్నారు. సూర్యగ్రహణము తీక్షనంగా చూడలేము కావున చంద్రగ్రహణము స్పష్టంగా చూడవచ్చును కావున ఈ వాక్యమును చెప్పిఉండవచ్చు. ఆమావాస్య సూర్యగ్రహణం పౌర్ణమిలో చంద్రగ్రహణం ప్రాప్తించును కదా! పౌర్ణమి పట్టు అనగా గ్రహణ ప్రారంభ కాలము నుండి మధ్య కాలము అని అర్థం. పాడ్యమి విడుపు అనగా గ్రహణ మధ్య కాలము నుండి గ్రహణ అంత్యకాలము వరకు అని అర్థం. దీనిని బట్టి గ్రహణ మధ్య కాలము పౌర్ణమి తిథి అంత్యము ఒకటే అని అర్థమగుచున్నది. ఈ సూత్రమునకు ప్రత్యక్షంగా సరిపోయేది ఎన్.సి. లహరి ప్రతిపాదించిన చిత్ర పక్ష అయనాంశ మాత్రమే, దృక్‌కు వచ్చుచున్నది కావున ఈ సిద్ధాంతమును దృక్ సిద్ధాంతము అని వ్యవహరింతురు. ఉభయ సాయన, నిరయణ పద్ధతులలో ఏ పద్ధతి ద్వారా తిథ్యాంతాన్ని సాధించినను శుద్ధ పాడ్యమి మొదలు బహుళ అమావాస్యాంత కాలములు ఒక్కటిగానే వచ్చితీరును. ఈ కారణం వల్లే పాశ్చాత్యుల సాయన పంచాంగ రీత్యా సాధించిన తిథ్యంత కాలానికే సమానంగా 1. ఎన్. సి. లహిరిగారి 2.బి.వి. రామన్‌గారి 3. కె.పి.గార్ల అయనాంశలరీత్యా సాధించిన తిథ్యంతాలు సమానంగా ప్రాప్తించుచున్నవి. ఇతర సూర్య సిద్ధాంతాది ఇతరత్ర అయనాంశలు గైకొని సాధించిన పంచాంగలలో మాత్రం పై తిథ్యంతకాలాలు ఎందుకు విభేదించు చున్నవో పాఠకులందరు ఆయా సిద్ధాంతులను ప్రశ్నించవలసి ఉన్నదని మనవి చేయు చున్నాను. సంపూర్ణ చంద్రగ్రహణ మధ్యకాలము ఎవరి అయనాంశములను తీసుకొని సాధించినా ప్రాప్తించు పౌర్ణమి తిథ్యంత కాలమునకు సమానముగా కాని, సమీపముగాకాని యుండునో వారు సాధించిన అయినాంశముల రీత్యా గణింపబడిన పంచాంగమే దృక్సిద్ధాంతమైనదని ఋజువగుచున్నది. పై సూత్రమునకు భిన్నంగా యున్న పంచాంగములు సరియైనవి కావని భావము. అలాగే అమావాస్య నాడు సూర్యగ్రహణ మధ్యకాలముతో అమావాస్య అంత్యకాలాలుకూడా ఏకీభవించాలి. రవి చంద్ర స్ఫుట భాగలిప్తలతో సమానంగా రాహు లేక కేతు గ్రహస్ఫుట భాగలిప్తలు సమానంగా యున్నప్పుడు మాత్రమే అమావాస్య అంత్యకాలము గ్రహణ మధ్యకాలము ఒకటిగా ఏకీభవించును. అయినాంశ భేదము అయినచో నక్షత్ర అంత్యకాలములు వ్యత్యాసముగా ప్రాప్తించుతీరును. జాతకంలో మహాదశాశేషములు విభిన్నంగా ప్రాప్తించునుగాన ఈ క్రింది సూత్రములు దృక్సిద్ధాంతం సత్యనిరూపణకు పూర్తిగా సరిపోవును. ఎవరి అయినాంశరీత్యా గణించిన పంచాంగరీత్యా మనగ్రామము లేదా పట్టణముమీద నడినెత్తిన సూర్యుడు మిట్టమధ్యాహ్నకాలన ఏ తేదీనాడు ప్రాప్తించునది (Sun Declaration) సాధించి ప్రత్యక్షంగా చూచినచో ఎవరి అయినాంశలరీత్యా తయారుచేయబడిన పంచాంగములు సరియైనదని తెలుసుకొనవచ్చును. ఎన్.సి. లహరిగారి అయనాంశము మాత్రమే అనుభవమునకు పై ప్రయోగము సరిపడినది. ఇతర అయనాంశలకు సరిపడలేదు.

హిందూ జ్యోతిష సిద్ధాంత రీత్యా ప్రస్తుత అయన చలనం ఎన్.సి. లహరి అయనాంశ లెక్కించాలన్న సాయన నిరయణ చక్రముల రెండిటి ఆరంభ బింధువులు రెండునూ (Zero Degrees fixed and movable Zodiacs ) 285 A.D సంవత్సరం కలియునని ఎన్.సి. లహరి గారు తాను రచించిన Tables of the Sun అను పుస్తకములో సిద్ధాంతపరమైన ఋజువులు చూపించాడు. అలాగే అయన చలనము కూడా ప్రఖ్యాత ఖగోళ శాస్త్రవేత్త న్యూ కోంబ్‌గారు ప్రతిపాదించిన 50.2388475 వెనుకకు చలించు విలువ సరియైనదని ఎన్.సి. లహరిగారు ప్రతిపాదించారు. ఈ అయనముల యెక్క చలనమే అయనాంశ అందురు. చలిత రాశి చక్రము యొక్క ఆరంభ బిందువు మేష రాశిలో $0^{\circ}$ అనునది ప్రతి సంవత్సరం మారుచున్నది, అనగా వెనుకకు నడుచుచున్నది. హిందూ శాస్త్రజ్ఞులు ఈ చలిత చక్రమును విడిచి ప్రత్యేకంగా మేషమును $0^{\circ}$ ఒక స్థిర ప్రదేశం నియమించిరి. అయితే ఈ స్థిర బింధువు ఎన్ని సంవత్సరములు గడిచినను అచటనే ఉండును. ఆ స్థిర బింధువును గుర్తించుటకు చిత్తా నక్షత్రము సహాయము తీసుకొనిరి. ఆ చిత్తా నక్షత్రమునకు $180^{\circ}$ ఎదురుగా ఉన్నది మేషం $0^{\circ}$ అనిరి. ఇట్లు స్థిర బింధువును ఏర్పరుచుట వలన స్థిర చక్రమైనది కాని అసలుకు రాశి చక్రము చలించుట వలన ఈ రెండిటి మధ్య దూరమే అయనాంశ అందురు. హిందూ స్థిర ఆరంభ బిందువు నుంచి లెక్కించ వలనన్న ప్రతి సంవత్సరం అయనాంశ చలిత రాశి చక్రము (సాయన చక్రము) నుండి తీసి వేయవలెను. అట్లు అయనాంశ తీసివేయబడినది అయినందు వల్ల నిరయణ రాశి చక్రము అయినది. చలిత రాశి చక్రములను సాయన రాశి చక్రములందురు. అయనాంశ తీసివేసినచో నిరయణ రాశి చక్రములు ఏర్పడును.



2000 సంవత్సరముల నుండి 2100 సంవత్సరముల మధ్య సరాసరి అయన చలనము 50.0879527 సెకనులు. 2006 సంవత్సరం అయనాంశ ఎంత అని లెక్కించవలెనన్న 2006 (–) 285 × 50.0879527 / 3600 సెకన్లు (1 నిమిషం) = $23^{\circ}-56^{'}-41^{''}$ అయినది. నిరయణ సిద్ధాంతము దృక్‌కు నిలుచు సిద్ధాంతము అనుటకు ఒక ఋజువు గమనించగలరు.

మృగశిర నక్షత్రము దినము రోజు రాత్రి మనము ఆకాశములో గమనించిన చంద్రుడు మృగశిర నక్షత్రము గల రోజు 4 చుక్కల మధ్య ఒక చుక్క చంద్రుని దగ్గర కనిపించును. గ్రామీనులు వాడుక బాషలో మృగశిర నక్షత్రమును గొర్రు కొయ్యలు అని వ్యవహరింతురు. పాశ్చాత్యుల సాయన పంచాంగ రీత్యా లెక్కించి చూడగా ప్రాప్తించు మృగశిర నక్షత్రము రోజు చంద్రుడు ఆకాశములో పై విధంగా కనిపించడు. ఈ తేడా అయనాంశ బేధము వలన కాన వచ్చును. ఈ కారణము వలన నిరయణ సిద్ధాంతము దృక్ సిద్ధాంతము అని గుర్తించబడుచున్నది.

నిరయణ రాశి చక్రములో దశాంతర్దశా విదశా ఫలాలు ఎన్.సి.లహరి ప్రతిపాదించిన చిత్రపక్షఅయనాంశకు (దృక్ సిద్ధాంతమునకు) నూటికి నూరు శాతము ఋజువగుచున్నది. సిద్ధాంత జాతక భాగములలో దృక్ సిద్ధాంతమే ఉత్తమమైనది.

# రాజమండ్రి పట్టణమునకు నిరయణ ద్వాదశరాశి ప్రమాణాలు

## ఉదాహరణ జాతకములు

## లగ్నస్ఫుటమును కనుగొను విధానము

**(ఈ ఉదాహరణ నాచే రచించబడి గతంలో ముద్రించబడి, ప్రస్తుతము అముద్రితమైన 62 సం॥రాల పంచాంగము నుండి స్వీకరించబడినది. దీనిని మోడల్‌గా మాత్రమే ఇచ్చితిమి. ఈ పంచాంగంలో లగ్నభుక్తి ఘడియలు విఘడియలు కొద్దిగా తేడావ్యండ వచ్చును.)**

ఉదాహరణ జాతకము - 1 : 25-01-1982 15 గం. 16 ని.ఐ.యస్.టి.

లగ్న స్ఫుటమును కనుగొనవలెనన్న రాజమండ్రి 17వ అక్షాంశమునకు నిరయణ ద్వాదశ లగ్నప్రమాణాలను, 25వ తేదీ భుక్తి, 25వ తేదీ రాజమండ్రి స్టాండర్డు కాలమునకు సూర్యోదయము ముందుగా వ్రాసుకోవాలి.

**రాజమండ్రి పట్టణమునకు నిరయణ ద్వాదశ రాశి ప్రమాణాలు**

| | ఘ. - వి.ఘ. | | ఘ. - వి.ఘ | | ఘ. - వి.ఘ |
|---|---|---|---|---|---|
| మేష | 4 - 22 | సింహం | 5 - 18 | ధనస్సు | 5 - 19 |
| వృషభం | 5 - 00 | కన్యా | 5 - 13 | మకరం | 4 - 40 |
| మిధునం | 5 - 31 | తులా | 5 - 24 | కుంభం | 4 - 08 |
| కర్కాటకం | 5 - 30 | వృశ్చికం | 5 - 34 | మీనం | 4 - 01 |

25వ తేది భుక్తి 01.38

రాజమండ్రి స్థానిక సూర్యోదయం 06 గం. 36 ని.

రాజమండ్రి యల్.యమ్.టి. 00 గం. 03 ని.

..................

06 గం. 33 ని.

(- యల్.యమ్.టి. వుంటే రాజమండ్రి స్థానిక సూర్యోదయములో తీసివేయాలి. రాజమండ్రి స్టాండర్డు సూర్యోదయము ప్రాప్తించును. రాజమండ్రి యల్.యమ్.టి. 2 ని.48 సె.లేదా 3 ని. సూర్యోదయమునకు తీసివేయవలెను.)

25వ తేదీకి ముందు రవి శ్రవణ నక్షత్రం 1వ పాదములో వున్నందున మకరరాశిలో రవి వుండును. కావున భుక్తి మకర భుక్తిగా భావించాలి.

ముందుగా రాజమండ్రి స్టాండర్డు సూర్యోదయము నుండి జననము వరకు ఎన్ని ఘడియలు ఎన్ని విఘడియలకు జననము అని తెలుసుకొనవలెనన్న జననంరైల్వే కాలమానమును తీసుకొని అందు సూర్యోదయము తీసివేసి 2 1/2 రెట్లు పెంచిన సూర్యోదయము ముందు జననము వరకు ఘడియలు విఘడియలు వచ్చును.

జననకాలం 15 గం. 16 ని.లో సూర్యోదయము 6గం. 39 ని. తీసివేసి × 2 1/2 రెట్లు = 21 ఘ.47.వి.ఘ.

సూర్యోదయము నుండి జననము వరకు ఘడియలు విఘడియలు 21 ఘ. 32 వి.ఘ. సూర్యోదయమునకు వున్న మకరలగ్నభుక్తి మకరరాశిభుక్తి మకర నిరయణరాశి ప్రమాణంలో తీసివేసిన మకరరాశి భోగ్యము వచ్చును. మకరరాశి భోగ్యమునకు జననకాల ఘడియలు విఘడియలు తీసివేయబడువరకు మిగిలిన రాశి ప్రమాణములను కలుపుతూ వచ్చిన జాతకుడు జన్మించిన లగ్నం వచ్చును.

మకర నిరయణ రాశిప్రమాణం : 04 ఘ. 40 వి.ఘ.

మకర భుక్తి : 01 ఘ. 38 వి.ఘ.

......................

మకర భోగ్యం : 03 ఘ. 02 వి. ఘ.

కుంభరాశి ప్రమాణం : 04 ఘ. 08 వి.ఘ

......................

07 ఘ. 10 వి.ఘ.

మీనరాశి ప్రమాణం : 04 ఘ. 01 వి. ఘ.

......................

11 ఘ. 11 వి.ఘ.

| | | |
|---|---|---|
| మేషరాశి ప్రమాణం | : | 04 ఘ. 22 వి.ఘ. |
| | | ..................... |
| | | 15 ఘ. 33 వి.ఘ. |
| వృషభరాశి ప్రమాణం | : | 05 ఘ. 00 వి.ఘ. |
| | | ..................... |
| | | 20 ఘ. 33 వి.ఘ. |
| మిధునరాశి ప్రమాణం | : | 05 ఘ. 31 వి.ఘ. |
| | | ..................... |
| | | 26 ఘ. 04 వి.ఘ. |
| సూర్యోదయము నుండి జననము వరకు ఘడియలు విఘడియలు | | 21ఘ. 47 వి.ఘ. |
| | | ..................... |
| మిధునభోగ్యం | : | 04 ఘ. 17 వి.ఘ. |
| మిధునరాశి ప్రమాణం | : | 05 ఘ. 31 వి.ఘ. |
| మిధునరాశి భోగ్యం | : | 04 ఘ. 17 వి.ఘ. |
| | | ..................... |
| మిధునభుక్తి | : | 01 ఘ. 14 వి.ఘ. |
| 30 భాగల ప్రామాణం | : | 05 ఘ. 31 వి. ఘ. అయితే |
| ? | : | 01 ఘ. 14 వి. ఘ. |

అన్ని ఒకేమానములోనికి మార్చాలి

$$\frac{1.14}{5.31} = \frac{60+14\times30}{5\times60+31} = \frac{74\times30}{331} = \frac{2220}{331} = 06.71$$ దశాంశములో

షష్టాంశములు = $6^{0} - 42^{1} - 36^{11}$

మిధునరాశిలో $6^{0} - 42^{1}\ 36^{11}$ లగ్న స్ఫుటము అగును.

## దశశేషం కనుగొను విధానం

జననము 25-01-1982 15 గం. 16 ని. యల్.యమ్.టి.

25వ తేది ఉత్తరాషాడ అంత్యం - 07 గం. 56 ని.

26వ తేది శ్రవణ అంత్యం - 09 గం. 37 ని.

25వ తేది ఉత్తరాషాడ 7 గం. 56 ని. వరకు వున్నది కావున తరువాత శ్రవణం వచ్చును. కావున శ్రవణం వచ్చు గంటల నిమిషముల నుండి జన్మకాలము వరకు నక్షత్ర భుక్తి అగును. జననకాలమునుండి శ్రవణ అంత్యకాలము వరకు నక్షత్ర శేషము అగును.

25వ తేది శ్రవణ నక్షత్రం ఆ దినం ఎన్ని గంటలు ఎన్ని నిమిషములు వున్నది అని కనుగొనవలెనన్న అర్ధరాత్రి వరకు ఎన్నిగంటలు ఎన్ని నిమిషములు అయితే అన్ని గంటలు అన్ని నిమిషాలు శ్రవణ నక్షత్రం ఆ దినం వుండును.

| | | |
|---|---|---|
| 25వ అర్ధరాత్రి 12 గం. వరకు శ్రవణ నక్షత్రం రైల్వేటైమ్ | = | 24 గం. 00 ని. |
| ఉత్తరాషాడ అంత్యం | = | 07 గం. 56 ని. |
| | | .................. |
| 25వ తేది శ్రవణ నక్షత్రం | = | 016 గ. 4 ని. |
| 26వ తేది శ్రవణం | = | 09 గం. 37 ని. |
| | | .................. |
| శ్రవణ నక్షత్ర ఆద్యంతం | = | 25 గం. 41 ని. |

నక్షత్ర శేషం తెలిస్తేగాని దశశేషం కట్టలేము. నక్షత్ర ఆద్యంతంలో నక్షత్ర భుక్తి (నక్షత్రం కాలం గడిచినకాలం) తీసివేసిన నక్షత్ర శేషం వచ్చును. జననకాలంనందు ఉత్తరాషాడ అంత్యం తీసివేసిన శ్రవణ నక్షత్రభుక్తి వచ్చును.

జననం = 15 గం. 16 ని.
ఉత్తరాషాడ అంత్యం = 07 గం. 56 ని.
..................
శ్రవణభుక్తి = 07 గం. 20 ని.

శ్రవణ నక్షత్ర ఆంధ్యంతం = 25 గం. 41 ని.
శ్రవణ నక్షత్రభుక్తి = 07 గం. 20 ని.
..................
శ్రవణ నక్షత్ర శేషం = 18 గం. 21 ని.

శ్రవణ నక్షత్రము పూర్తి ప్రమాణంనకు 10 సంవత్సరము చంద్రమహాదశ అయితే
మనకు శ్రవణ నక్షత్ర శేషం = 18 గం. 21 ని.
కావున 25 గం. 41 ని.ల ప్రమాణమునకు 10 సంవత్సరములు చంద్రదశ అయితే నక్షత్రశేషం 18 గం. 21 ని.లకు ఎంత ?

చంద్ర దశ = నక్షత్రశేషం × 10 / నక్షత్ర ఆద్యంతం

= 18-21 × 10 / 25-41

అన్ని ఒకేమానములోకి మార్చుకోవాలి.

(18 × 60 + 21) / (25 × 60 + 41) = 110 × 10 / 1541

= 11010 / 1541

1541) 11010 (7 సంవత్సరాలు
10787
..........
223×12
...........
1541) 2676 ( 1నెల
1541
..............
1135×30
..............
1541) 34050(22 రోజులు
33902
...........
148
..............

చంద్రదశశేషం 7 సంవత్సరముల 1 నెల 22 రోజులు.

(ఈ ఉదాహరణ నాచే రచించబడి గతంలో ముద్రించబడి, ప్రస్తుతము అముద్రితమైన 62 సం॥రాల పంచాంగము నుండి స్వీకరించబడినది. దీనిని మోడల్‌గా మాత్రమే ఇచ్చితిమి. ఈ పంచాంగంలో నక్షత్ర అంత్యములు నిమిషాలలో కొద్దిగా తేడావుండ వచ్చును.)

# రాజమండ్రి పట్టణమునకు నిరయణ ద్వాదశరాశి ప్రమాణాలు

## ఉదాహరణ జాతకములు

## లగ్నస్ఫుటమును కనుగొను విధానము

(ఈ ఉదాహరణ నాచే రచించబడి గతంలో ముద్రించబడి, ప్రస్తుతము అముద్రితమైన 62 సం॥రాల పంచాంగము నుండి స్వీకరించబడినది. దీనిని మోడల్‌గా మాత్రమే ఇచ్చితిమి. ఈ పంచాంగంలో లగ్నభుక్తి ఘడియలు విఘడియలు కొద్దిగా తేడావ్యండ వచ్చును.)

ఉదాహరణ జాతకము - 2 : 11-12-1981 28 గం. 06 ని.I.S.T. (తెల్లవారుజామున 4 గం. 6 ని.)

లగ్న స్ఫుటమును కనుగొనవలెనన్న రాజమండ్రి 17వ అక్షాంశమునకు నిరయణ ద్వాదశ లగ్నప్రమాణాలను, 11వ తేదీ భుక్తి, 11వ తేదీ రాజమండ్రి స్టాండర్డు కాలమునకు సూర్యోదయము ముందుగా వ్రాసుకోవాలి.

**రాజమండ్రి పట్టణమునకు నిరయణ ద్వాదశ రాశి ప్రమాణాలు**

| | ఘ. - వి.ఘ. | | ఘ. - వి.ఘ | | ఘ. - వి.ఘ |
|---|---|---|---|---|---|
| మేష | 4 - 22 | సింహం | 5 - 18 | ధనస్సు | 5 - 19 |
| వృషభం | 5 - 00 | కన్యా | 5 - 13 | మకరం | 4 - 40 |
| మిధునం | 5 - 31 | తులా | 5 - 24 | కుంభం | 4 - 08 |
| కర్కాటకం | 5 - 30 | వృశ్చికం | 5 - 34 | మీనం | 4 - 01 |

11వ తేది భుక్తి 04.34

రాజమండ్రి స్థానిక సూర్యోదయం 06 గం. 22 ని.

రాజమండ్రి యల్.యమ్.టి. 00 గం. 03 ని.

..................

06 గం. 19 ని.

(- యల్.యమ్.టి. వుంటే రాజమండ్రి స్థానిక సూర్యోదయములో తీసివేయాలి. రాజమండ్రి స్టాండర్డు సూర్యోదయము ప్రాప్తించును. రాజమండ్రి యల్.యమ్.టి. 2 ని.48 సె.లేదా 3 ని. సూర్యోదయమునకు తీసివేయవలెను.)

11వ తేదీకి ముందు రవి జ్యేష్ట నక్షత్రం 3వ పాదములో వున్నందున వృశ్చికరాశిలో రవి వుండును. కావున భుక్తి మకర భుక్తిగా భావించాలి.

ముందుగా రాజమండ్రి స్టాండర్డు సూర్యోదయము నుండి జననము వరకు ఎన్ని ఘడియలు ఎన్ని విఘడియలకు జననము అని తెలుసుకొనవలెనన్న జననంరైల్వే కాలమానమును తీసుకొని అందు సూర్యోదయము తీసివేసి 2 1/2 రెట్లు పెంచిన సూర్యోదయము ముందు జననము వరకు ఘడియలు విఘడియలు వచ్చును.

జననకాలం 28 గం.06 ని.లో సూర్యోదయము 6గం. 19 ని. తీసివేసి × 2 1/2 రెట్లు = 54 ఘ.27.వి.ఘ.

సూర్యోదయము నుండి జననము వరకు ఘడియలు విఘడియలు 54 ఘ. 27 వి.ఘ. సూర్యోదయమునకు వున్న మకరరాశిభుక్తి మకర నిరయణరాశి ప్రమాణంలో తీసివేసిన మకరరాశి భోగ్యము వచ్చును. మకరరాశి భోగ్యమునకు జననకాల ఘడియలు విఘడియలు తీసివేయబడువరకు మిగిలిన రాశి ప్రమాణములను కలుపుతూ వచ్చిన జాతకుడు జన్మించిన లగ్నం వచ్చును.

వృశ్చిక నిరయణ రాశిప్రమాణం : 05 ఘ. 34 వి.ఘ.

వృశ్చిక భుక్తి : 04 ఘ. 34 వి.ఘ.

......................

వశ్చిక భోగ్యం : 01 ఘ. 00 వి. ఘ.

ధనస్సురాశి ప్రమాణం : 05 ఘ. 19 వి.ఘ

......................

06 ఘ. 19 వి.ఘ.

మకరరాశి ప్రమాణం : 04 ఘ. 40 వి. ఘ.

......................

10 ఘ. 07 వి. ఘ.

| | | |
|---|---|---|
| కుంభరాశి ప్రమాణం | : | 04 ఘ. 08 వి. ఘ. |
| | | ...................... |
| | | 15 ఘ. 07 వి. ఘ. |
| మీనరాశి ప్రమాణం | : | 04 ఘ. 01 వి. ఘ. |
| | | ...................... |
| | | 19 ఘ. 08 వి. ఘ. |
| మేషరాశి ప్రమాణం | : | 04 ఘ. 22 వి. ఘ. |
| | | ...................... |
| | | 23 ఘ. 30 వి. ఘ. |
| వృషభరాశి ప్రమాణం | : | 05 ఘ. 00 వి. ఘ. |
| | | ...................... |
| | | 28 ఘ. 30 వి. ఘ. |
| మిధునరాశి ప్రమాణం | : | 05 ఘ. 31 వి. ఘ. |
| | | ...................... |
| | | 34 ఘ. 01 వి. ఘ. |
| కర్కాటకరాశి ప్రమాణం | : | 05 ఘ. 30 వి. ఘ. |
| | | ...................... |
| | | 39 ఘ. 31 వి. ఘ. |
| సింహరాశి ప్రమాణం | : | 05 ఘ. 18 వి. ఘ. |
| | | ...................... |
| | | 44 ఘ. 49 వి. ఘ. |
| కన్యరాశి ప్రమాణం | : | 05 ఘ. 13 వి. ఘ. |
| | | ...................... |
| | | 50 ఘ. 02 వి. ఘ. |
| తులరాశి ప్రమాణం | : | 05 ఘ. 24 వి. ఘ. |
| | | ...................... |
| | | 55 ఘ. 26 వి. ఘ. |
| సూర్యోదయము నుండి జననము వరకు ఘడియలు విఘడియలు | | 54 ఘ. 27 వి. ఘ. |
| | | ...................... |
| తులాభోగ్యం | : | 00 ఘ. 59 వి. ఘ. |
| తులరాశి ప్రమాణం | : | 05 ఘ. 24 వి. ఘ. |
| తుల భోగ్యం | : | 00 ఘ. 59 వి. ఘ. |
| | | ...................... |
| తుల భుక్తి | : | 04 ఘ. 25 వి. ఘ. |
| 30 భాగల ప్రమాణం | : | 05 ఘ. 24 వి. ఘ. |
| ? | : | 00 ఘ. 59 వి. ఘ. |

అన్ని ఒకేమానములోనికి మార్చాలి

$$\frac{4.25 \times 30}{5 \times 60+25} = \frac{40 \times 60+25}{325} = \frac{265 \times 30}{325} = \frac{7950}{325} = 24.46$$

షష్టాంశములు = $24^0 - 27^1 - 36^{11}$

తుల రాశిలో $24^0 - 27^1\ 37^{11}$ లగ్న స్ఫుటము అగును.

# దశశేషం కనుగొను విధానం

జననము 11-12-1981 28 గం. 06 ని. I.S.T. (తెల్లవారుజామున 4 గం. 6 ని.)

11వ తేది రోహిణి అంత్యం - 10 గం. 36 ని.

26వ తేది శ్రవణ అంత్యం - 07 గం. 36 ని.

11వ తేది రోహిణి 10 గం. 36ని. వరకు వున్నది కావున తరువాత మృగశిర వచ్చును. కావున మృగశిర వచ్చు గంటల నిమిషముల నుండి జన్మకాలము వరకు నక్షత్ర భుక్తి అగును. జననకాలమునుండి మృగశిర అంత్యకాలము వరకు నక్షత్ర శేషము అగును.

11వ తేది మృగశిర నక్షత్రం ఆ దినం ఎన్ని గంటలు ఎన్ని నిమిషములు వున్నది అని కనుగొనవలెనన్న అర్ధరాత్రి వరకు ఎన్నిగంటలు ఎన్ని నిమిషములు అయితే అన్ని గంటలు అన్ని నిమిషాలు మృగశిర నక్షత్రం ఆ దినం వుండును.

| | | |
|---|---|---|
| 11వ అర్ధరాత్రి 12 గం. వరకు మృగశిర నక్షత్రం రైల్వేటైమ్ | = | 24 గం. 00 ని. |
| రోహిణి అంత్యం | = | 10 గం. 36 ని. |
| | | .................. |
| 11వ తేది మృగశిరనక్షత్రం | = | 13 గం. 24 ని. |
| 12వ తేది మృగశిర నక్షత్రం | = | 07 గం. 36 ని. |
| | | .................. |
| మృగశిర నక్షత్ర ఆద్యంతం | = | 21 గం. 00 ని. |

నక్షత్ర శేషం తెలిస్తేగాని దశశేషం కట్టలేము. నక్షత్ర ఆద్యంతంలో నక్షత్ర భుక్తి (నక్షత్రం కాలం గడిచినకాలం) తీసివేసిన నక్షత్ర శేషం వచ్చును. జననకాలంనందు రోహిణి నక్షత్ర అంత్యం తీసివేసిన శ్రవణ నక్షత్రభుక్తి వచ్చును.

| | | |
|---|---|---|
| జననం | = | 28 గం. 06 ని. |
| రోహిణి అంత్యం | = | 10 గం. 36 ని. |
| | | .................. |
| మృగశిర భుక్తి | = | 17 గం. 30 ని. |
| మృగశిర నక్షత్రఆంధ్యంతం | = | 21 గం. 00 ని. |
| మృగశిర నక్షత్రభుక్తి | = | 17 గం. 30 ని. |
| | | .................. |
| మృగశిర నక్షత్ర శేషం | = | 03 గం. 30 ని. |

(ఈ ఉదాహరణ నాచే రచించబడి గతంలో ముద్రించబడి, ప్రస్తుతము అముద్రితమైన 62 సం॥రాల పంచాంగము నుండి స్వీకరించబడినది. దీనిని మోడల్‌గా మాత్రమే ఇచ్చితిమి. ఈ పంచాంగంలో నక్షత్ర అంత్యములు నిమిషాలలో కొద్దిగా తేడావుండ వచ్చును.)

మృగశిర నక్షత్రము పూర్తి ప్రమాణంనకు 7 సంవత్సరము కుజదశ అయితే

మనకు మృగశిర నక్షత్ర శేషం = 03 గం. 30 ని.

కావున 21 గం. 00 ని.ల ప్రమాణమునకు 7 సంవత్సరములు కుజదశ అయితే నక్షత్రశేషం 03 గం. 30 ని.లకు ఎంత ?

$$\text{కుజ దశ} = \frac{\text{నక్షత్రశేషం} \times 7}{\text{నక్షత్ర ఆద్యంతం}} = \frac{03\text{-}30 \times 7}{21\text{-}00}$$

అన్ని ఒకేమానములోకి మార్చుకోవాలి.

$$\frac{03 \times 60 + 30}{21 \times 60} = \frac{210 \times 7}{1260} = \frac{1470}{1260}$$

1260

1260) 1470 (1 సంవత్సరాలు
1260
..........
210×12
...........
1260) 2520 (2నెల
2520
..............
0
..............

కుజదశశేషం 1 సంవత్సరముల 2 నెల.

# లగ్నస్పుట నిర్ణయము

1. రాజమండ్రికి తెల్పిన లగ్నారంభకాలం కావలసిన తేది నెలకు తీసుకొని మనకు కావలసిన ప్రదేశమునకు (+) చిహ్నమున్న కలపాలి. (–) చిహ్నమున్న తీసివేయాలి.

2. లగ్న అంత్య కాలములో ప్రారంభ కాలం తీసివేస్తే లగ్నముయొక్క ఆధ్యంత కాలం గంటలు, నిముషాలలో వచ్చును.

3. జనన కాలం (రైల్వే టైమ్) లో లిఖించి, లగ్న ప్రారంభాన్ని తీసివేస్తే అప్పటి వరకూ గడచిన లగ్నము యొక్క భుక్తి గం॥ ని॥లలో వచ్చును.

4. $\frac{\text{గడచిన లగ్నము యొక్క భుక్తి}}{\text{లగ్న ఆధ్యంత కాలము}} \times 30^0$ = లగ్నముయొక్క భాగలు (డిగ్రీలు), లిప్తలు (మినిట్స్) వచ్చును.

5. లగ్న రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) ను నక్షత్ర స్వరూప పట్టికలో చూడగా లగ్నమునకు నక్షత్ర పాదము వచ్చును. నవాంశ టేబుల్ ద్వారా రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) ను గమనించి నవాంశ లగ్నము వేయవచ్చును.

# చంద్రస్పుటం, నక్షత్ర పాదం, రాశి కనుగొను విధము

మోడల్ 1. :- అర్ధరాత్రి 12-00 గం॥ల తరువాత తెల్లవారుజామున 5గం॥30ని॥ల లోపు జన్మించినపుడు ఈ విధానాన్ని అనుసరించాలి.

1. జన్మించిన తేది చంద్రస్పుట రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) లలో వెనుక తేది చంద్రస్పుట రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) ను తీసివేయాలి. చంద్రుని దినచరణ భాగలు (డిగ్రీలు) లిప్తలు (మినిట్స్) వచ్చును.

2. జనన కాలం (రైల్వే టైమ్) లో లిఖించాలి. అర్ధరాత్రి 12 గం॥ను – 24 గం॥లుగ, రాత్రి 1 గం॥ను – 25 గం॥లుగ, రాత్రి 2 గం॥ను – 26 గం॥లుగ, రాత్రి 3 గం॥ను – 27 గం॥లుగ, రాత్రి 4 గం॥ను – 28 గం॥లుగ, తెల్లవారుజాము 5 గం॥ను-29 గం॥లుగ, 5 గం॥ 30 ని॥ లను 29గం॥ 30 ని॥లుగా లిఖించాలి. రైల్వే టైమ్‌లో లిఖించిన జనన కాలములో ఎఫెమరీస్ టైమ్ ఉదయము 5గం॥30ని॥లు తీసివేయాలి. ఎఫెమరీస్ టైమ్ నుండి జననకాలము వరకు గడచిన గం॥ని॥ వచ్చును.

3. చంద్రుని దినచరణం లాగరథమ్ పట్టికలో డిగ్రీలు, నిముషాలకు లాగరథమ్ కనుగొని ఒకచోట వ్రాసుకోవాలి.

ఎఫెమరీస్ టైమ్ నుండి జననకాలము వరకు కాలమునకు లాగరథమ్ పట్టికలో గం॥ ని॥లకు లాగరథమ్ కనుగొని ఒకచోట వ్రాసుకోవాలి.

డిగ్రీలు నిముషాలు చంద్రుని దినచలనము చూచిన లాగరథమ్, గం॥ ని॥లు, జననం నుండి ఎఫెమరీస్ టైమ్ వరకు చూచిన లాగరథమ్ రెండూ కూడాలి. ఆ వచ్చిన మొత్తము లాగరథమ్‌కు దగ్గరగా ఉన్న సంఖ్య దగ్గరకు పోయి పట్టిక పై భాగాన డిగ్రీలు లేక గంటలు కాలమ్ చూడగా డిగ్రీలు వచ్చును. పట్టిక పక్క భాగాన మినిట్స్ కాలమ్‌లో చూడగా నిమిషాలు వచ్చును.

4. క్రిందటి దినము చంద్ర స్పుటం రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) లకు లాగరథమ్ ద్వారా వచ్చిన డిగ్రీలు మినిట్స్ కలుపగా జననకాలం వరకు చంద్రస్పుటం వచ్చును. నక్షత్ర స్వరూప పట్టికలో చూడగా నక్షత్ర పాదము, రాశి వచ్చును. నవాంశ పట్టికలో చూడగా చంద్రుడు ఉందురాశి వచ్చును.

# చంద్రస్పుటం, నక్షత్ర పాదం, రాశి కనుగొను విధము

మోడల్ 2. :- తెల్లవారుజామున 5గం॥30ని॥ల నుండి అర్ధరాత్రి 12-00 గం॥ల లోపు జన్మించినపుడు ఈ విధానాన్ని అనుసరించాలి.

1. జన్మించిన తేదికి ముందు తేది చంద్రస్పుట రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) లలో జన్మించిన తేది చంద్రస్పుట రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) ను తీసివేయాలి. చంద్రుని దినచరణ భాగలు (డిగ్రీలు) లిప్తలు (మినిట్స్) వచ్చును.

2. జనన కాలం (రైల్వే టైమ్) లో లిఖించాలి. మధ్యాహ్నం 1 గం॥ను – 13 గం॥లుగ, మధ్యాహ్నం 3 గం॥ను – 15 గం॥లుగ, సాయంత్రం 6 గం॥ను – 18 గం॥లుగ, రాత్రి12 గం॥లుగ, 24 గం॥లుగా లిఖించాలి. రైల్వే టైమ్‌లో లిఖించిన జనన కాలములో ఎఫెమరీస్ టైమ్ ఉదయము 5గం॥30ని॥లు తీసివేయాలి. ఎఫెమరీస్ టైమ్ నుండి జననకాలము వరకు గడచిన గం॥ ని॥ వచ్చును.

3. చంద్రుని దినచరణం లాగరథమ్ పట్టికలో డిగ్రీలు, నిముషాలకు లాగరథమ్ కనుగొని ఒకచోట వ్రాసుకోవాలి.

ఎఫెమరీస్ టైమ్ నుండి జననకాలము వరకు కాలమునకు లాగరథమ్ పట్టికలో గం॥ ని॥లకు లాగరథమ్ కనుగొని ఒకచోట వ్రాసుకోవాలి.

డిగ్రీలు నిముషాలు చంద్రుని దినచలనము చూచిన లాగరథమ్, గం॥ ని॥లు, జననం నుండి ఎఫెమరీస్ టైమ్ వరకు చూచిన లాగరథమ్ రెండూ కూడాలి. ఆ వచ్చిన మొత్తము లాగరథమ్‌కు దగ్గరగా ఉన్న సంఖ్య దగ్గరకు పోయి పట్టిక పై భాగాన డిగ్రీలు లేక గంటలు కాలమ్ చూడగా డిగ్రీలు వచ్చును. పట్టిక పక్క భాగాన మినిట్స్ కాలమ్‌లో చూడగా నిమిషాలు వచ్చును.

4. ఆ దినము చంద్ర స్పుటం రాశి (సైన్) భాగ (డిగ్రీ) లిప్తలు (మినిట్స్) లకు లాగరథమ్ ద్వారా వచ్చిన డిగ్రీలు మినిట్స్ కలుపగా జననకాలం వరకు చంద్రస్పుటం వచ్చును. నక్షత్ర స్వరూప పట్టికలో చూడగా నక్షత్ర పాదము, రాశి వచ్చును. నవాంశ పట్టికలో చూడగా నవాంశలో చంద్రుడు ఉందు రాశి వచ్చును.

## సింహ లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 03 | 06 | 09 | 12 | 15 | 18 | 21 | 24 | 27 | 03 | 06 | 09 |
| చంద్ర | 23 | 19 | 15 | 11 | 07 | 03 | 26 | 22 | 18 | 14 | 10 | 06 |
| కుజ | 08 | 16 | 24 | 05 | 13 | 21 | 02 | 10 | 18 | 26 | 07 | 15 |
| బుధ | 04 | 08 | 12 | 16 | 20 | 24 | 01 | 05 | 09 | 13 | 17 | 21 |
| గురు | 26 | 25 | 24 | 23 | 22 | 21 | 20 | 19 | 18 | 17 | 16 | 15 |
| శుక్ర | 19 | 11 | 03 | 22 | 14 | 06 | 25 | 17 | 09 | 01 | 20 | 12 |
| శని | 14 | 01 | 15 | 02 | 16 | 03 | 17 | 04 | 18 | 05 | 19 | 06 |
| రాహు | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| కేతు | 08 | 16 | 24 | 05 | 13 | 21 | 02 | 10 | 18 | 26 | 07 | 15 |

## కన్య లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| చంద్ర | 06 | 12 | 18 | 24 | 03 | 09 | 15 | 21 | 27 | 06 | 12 | 18 |
| కుజ | 15 | 03 | 18 | 06 | 21 | 09 | 24 | 12 | 27 | 15 | 03 | 18 |
| బుధ | 21 | 15 | 09 | 03 | 24 | 18 | 12 | 06 | 27 | 21 | 15 | 09 |
| గురు | 15 | 03 | 18 | 06 | 21 | 09 | 24 | 12 | 27 | 15 | 03 | 18 |
| శుక్ర | 12 | 24 | 09 | 21 | 06 | 18 | 03 | 15 | 27 | 12 | 24 | 09 |
| శని | 06 | 12 | 18 | 24 | 03 | 09 | 15 | 21 | 27 | 06 | 12 | 18 |
| రాహు | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 |
| కేతు | 15 | 03 | 18 | 06 | 21 | 09 | 24 | 12 | 27 | 15 | 03 | 18 |

## తుల లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → <br> గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 15 | 03 | 18 | 06 | 21 | 09 | 24 | 12 | 27 | 15 | 03 | 18 |
| చంద్ర | 16 | 05 | 21 | 10 | 26 | 15 | 04 | 20 | 09 | 25 | 14 | 03 |
| కుజ | 22 | 17 | 12 | 07 | 02 | 24 | 19 | 14 | 09 | 04 | 26 | 21 |
| బుధ | 11 | 22 | 06 | 17 | 01 | 12 | 23 | 07 | 18 | 02 | 13 | 24 |
| గురు | 04 | 08 | 12 | 16 | 20 | 24 | 01 | 05 | 09 | 13 | 17 | 21 |
| శుక్ర | 05 | 10 | 15 | 20 | 25 | 03 | 08 | 13 | 18 | 23 | 01 | 06 |
| శని | 25 | 23 | 21 | 19 | 17 | 15 | 13 | 11 | 09 | 07 | 05 | 03 |
| రాహు | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 |
| కేతు | 22 | 17 | 12 | 07 | 02 | 24 | 19 | 14 | 09 | 04 | 26 | 21 |

## వృశ్చిక లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → <br> గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 21 | 15 | 09 | 03 | 24 | 18 | 12 | 06 | 27 | 21 | 15 | 09 |
| చంద్ర | 26 | 25 | 24 | 23 | 22 | 21 | 20 | 19 | 18 | 17 | 16 | 15 |
| కుజ | 02 | 04 | 06 | 08 | 10 | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 24 |
| బుధ | 01 | 02 | 03 | 04 | 05 | 06 | 07 | 08 | 09 | 10 | 11 | 12 |
| గురు | 20 | 13 | 06 | 26 | 19 | 12 | 05 | 25 | 18 | 11 | 04 | 24 |
| శుక్ర | 25 | 23 | 21 | 19 | 17 | 15 | 13 | 11 | 09 | 07 | 05 | 03 |
| శని | 17 | 07 | 24 | 14 | 04 | 21 | 11 | 01 | 18 | 08 | 25 | 15 |
| రాహు | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| కేతు | 02 | 04 | 06 | 08 | 10 | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 24 |

## ధనుర్ లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 |
| చంద్ర | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| కుజ | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| బుధ | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 |
| గురు | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| శుక్ర | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 |
| శని | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| రాహు | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 |
| కేతు | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |

## మకర లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 06 | 12 | 18 | 24 | 03 | 09 | 15 | 21 | 27 | 06 | 12 | 18 |
| చంద్ర | 19 | 11 | 03 | 22 | 18 | 06 | 25 | 17 | 09 | 01 | 20 | 12 |
| కుజ | 16 | 05 | 21 | 10 | 26 | 15 | 04 | 20 | 09 | 25 | 14 | 03 |
| బుధ | 08 | 16 | 24 | 05 | 13 | 21 | 02 | 10 | 18 | 26 | 07 | 15 |
| గురు | 25 | 23 | 21 | 19 | 17 | 05 | 13 | 11 | 09 | 07 | 05 | 03 |
| శుక్ర | 11 | 22 | 06 | 17 | 01 | 12 | 23 | 07 | 18 | 02 | 13 | 24 |
| శని | 01 | 02 | 03 | 04 | 05 | 06 | 07 | 08 | 09 | 10 | 11 | 12 |
| రాహు | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 |
| కేతు | 16 | 05 | 21 | 10 | 26 | 15 | 04 | 20 | 09 | 25 | 14 | 03 |

## కుంభ లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 12 | 24 | 09 | 21 | 06 | 18 | 03 | 15 | 27 | 12 | 24 | 09 |
| చంద్ర | 02 | 04 | 06 | 08 | 10 | 12 | 14 | 16 | 18 | 20 | 22 | 24 |
| కుజ | 23 | 19 | 15 | 11 | 07 | 03 | 26 | 22 | 18 | 14 | 10 | 06 |
| బుధ | 25 | 23 | 21 | 19 | 17 | 15 | 13 | 11 | 09 | 07 | 05 | 03 |
| గురు | 14 | 01 | 15 | 02 | 16 | 03 | 17 | 04 | 18 | 05 | 19 | 06 |
| శుక్ర | 04 | 08 | 12 | 16 | 20 | 24 | 01 | 05 | 09 | 13 | 17 | 21 |
| శని | 20 | 13 | 06 | 26 | 19 | 12 | 05 | 25 | 18 | 11 | 04 | 24 |
| రాహు | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 | 09 | 18 | 27 |
| కేతు | 23 | 19 | 15 | 11 | 07 | 03 | 26 | 22 | 18 | 14 | 10 | 06 |

## మీన లగ్నజులకు గ్రహ సమయములు కనుగొను విధానము

| రాశి → గ్రహం ↓ | మేషంలో గ్రహమున్న | వృషభంలో గ్రహమున్న | మిథునంలో గ్రహమున్న | కటకంలో గ్రహమున్న | సింహంలో గ్రహమున్న | కన్యలో గ్రహమున్న | తులలో గ్రహమున్న | వృశ్చికంలో గ్రహమున్న | ధనస్సులో గ్రహమున్న | మకరంలో గ్రహమున్న | కుంభంలో గ్రహమున్న | మీనంలో గ్రహమున్న |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 | 18 | 09 | 27 |
| చంద్ర | 12 | 24 | 09 | 21 | 06 | 18 | 03 | 15 | 27 | 12 | 24 | 09 |
| కుజ | 03 | 06 | 09 | 12 | 15 | 18 | 21 | 24 | 27 | 03 | 06 | 09 |
| బుధ | 15 | 03 | 18 | 06 | 21 | 09 | 24 | 12 | 27 | 15 | 03 | 18 |
| గురు | 03 | 06 | 09 | 12 | 15 | 18 | 21 | 24 | 27 | 03 | 06 | 09 |
| శుక్ర | 24 | 21 | 18 | 15 | 12 | 09 | 06 | 03 | 27 | 24 | 21 | 18 |
| శని | 12 | 24 | 09 | 21 | 06 | 18 | 03 | 15 | 27 | 12 | 24 | 09 |
| రాహు | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 | 27 |
| కేతు | 03 | 06 | 09 | 12 | 15 | 18 | 21 | 24 | 27 | 03 | 06 | 09 |

# NAVAMSA TABLE

| Rasi | 1st $0^0 - 00^1$ to $3^0 - 20^1$ | 2nd $3^0 - 20^1$ to $6^0 - 40^1$ | 3rd $6^0 - 40^1$ to $10^0 - 00^1$ | 4th $10^0 - 00^1$ to $13^0 - 20^1$ | 5th $13^0 - 20^1$ to $16^0 - 40^1$ | 6th $16^0 - 40^1$ to $20^0 - 00^1$ | 7th $20^0 - 00^0$ to $23^0 - 20^1$ | 8th $23^0 - 20^1$ to $26^0 - 40^1$ | 9th $26^0 - 40^1$ to $30^0 - 00^1$ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. Mesham | Mesha | Vrushabha | Mithuna | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus |
| 2. Vrushabam | Makara | Kumbha | Meena | Mesha | Vrushaba | Mithuna | Kataka | Simha | Kanya |
| 3. Mithunam | Tula | Vruchika | Dhanus | Makara | Kumba | Meena | Mesha | Vrushaba | Mithuna |
| 4. Kataka | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus | Makara | Kumba | Meena |
| 5. Simham | Mesha | Vrushaba | Mithuna | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus |
| 6. Kanya | Makara | Kumba | Meena | Mesha | Vrushaba | Mithuna | Kataka | Simha | Kanya |
| 7. Tula | Tula | Vruchika | Dhanus | Makara | Kumba | Meena | Mesha | Vrushab | Mithuna |
| 8. Vruchikam | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus | Makara | Kumha | Meena |
| 9. Dhanus | Mesha | Vrushaba | Mithuna | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus |
| 10. Makaram | Makara | Kumba | Meena | Mesha | Vrushaba | Mithuna | Kataka | Simha | Kanya |
| 11. Kumbam | Tula | Vruchika | Dhanus | Makara | Kumba | Meena | Mesha | Vrushaba | Mithuna |
| 12. Meenam | Kataka | Simha | Kanya | Tula | Vruchika | Dhanus | Makara | Kumba | Meena |

## నవాంశను గ్రహనక్షత్ర పాదముల ద్వారా సాధించు విధానము

| మేషం | వృషభం | మిధునం | కర్కాటకం | సింహం | కన్య | తుల | వృశ్చికం | ధనస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని1 | అశ్వని 2 | అశ్వని 3 | అశ్వని 4 | భరణి1 | భరణి 2 | భరణి 3 | భరణి 4 | కృత్తిక 1 | కృత్తిక2 | కృత్తిక3 | కృత్తిక 4 |
| రోహిణి1 | రోహి2 | రోహి3 | రోహి4 | మృగ1 | మృగ2 | మృగ3 | మృగ4 | ఆరుద్ర1 | ఆరుద్ర2 | ఆరుద్ర3 | ఆరుద్ర4 |
| పునర్వసు1 | పున 2 | పున 3 | పున 4 | పుష్యమి1 | పుష్యమి2 | పుష్యమి3 | పుష్యమి4 | ఆశ్లేష1 | ఆశ్లేష2 | ఆశ్లేష3 | ఆశ్లేష4 |
| మఖ 1 | మఖ 2 | మఖ 3 | మఖ 4 | పుబ్బ 1 | పుబ్బ 2 | పుబ్బ 3 | పుబ్బ 4 | ఉత్తర 1 | ఉత్తర 2 | ఉత్తర 3 | ఉత్తర 4 |
| హస్త 1 | హస్త 2 | హస్త 3 | హస్త 4 | చిత్త 1 | చిత్త 2 | చిత్త 3 | చిత్త 4 | స్వాతి 1 | స్వాతి 2 | స్వాతి 3 | స్వాతి 4 |
| విశాఖ 1 | విశాఖ 2 | విశాఖ 3 | విశాఖ 4 | అనూ1 | అనూ 2 | అనూ 3 | అనూ 4 | జ్యేష్ఠ 1 | జ్యేష్ఠ 2 | జ్యేష్ఠ 3 | జ్యేష్ఠ 4 |
| మూల 1 | మూల 2 | మూల 3 | మూల 4 | పూ.షా1 | పూ.షా2 | పూ.షా3 | పూ.షా4 | ఉ.షా 1 | ఉ.షా 2 | ఉ.షా 3 | ఉ.షా 4 |
| శ్రవణం1 | శ్రవణం2 | శ్రవణం3 | శ్రవణం4 | ధనిష్ట1 | ధనిష్ట2 | ధనిష్ట3 | ధనిష్ట4 | శతభిష1 | శతభిష2 | శతభిష3 | శతభిష4 |
| పూ.భా 1 | పూ.భా2 | పూ.భా3 | పూ.భా4 | ఉ.భా1 | ఉ.భా2 | ఉ.భా3 | ఉ.భా4 | రేవతి1 | రేవతి2 | రేవతి 3 | రేవతి 4 |

## నవగ్రహ శాంతి విధానము

కర్మసాక్షి అయిన సూర్యభగవానుడు ప్రతి దిక్కును గం3.00 కాలము ఎనిమిది దిక్కులను ఆరోహించును. ఒకొక్క దిక్కును గం॥1.30ని॥ ఆరోహించును. ఒకొక్క దిక్కును గం॥1.30ని॥ అవరోహించును. సూర్యోదయము ఉదయం గం॥6.00లకు, పూర్యాస్తమయము సాయంకాలము గం॥6.00లకు అగు దినమున తెల్లవారు జామున 4గం॥30ని॥లకు తూర్పుదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి ఉదయము 6 గంటలకు తూర్పు దిశా మధ్య బిందువునకు చేరుచున్నాడు. తూర్పుదిశా మధ్యబిందువు నుండి ఉదయము 7గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. ఉదయము 7గం॥30ని॥లకు ఆగ్నేయదిశా ప్రారంభబిందువులో ఆరోహించి ఉదయము 9 గంటలకు ఆగ్నేయ దిశామధ్య బిందువునకు చేరుచున్నాడు. ఆగ్నేయ దిశామధ్య బిందువునుండి ఉదయము 10గం॥ 30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. ఉదయము 10గం॥30 ని॥లకు దక్షిణదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి మధ్యాహ్నము 12 గంటలకు దక్షిణ దిశా మధ్య బిందువునకు చేరుచున్నాడు. దక్షిణ దిశా మధ్య బిందువు నుండి మధ్యాహ్నము 1గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. మధ్యాహ్నము 1గం॥30ని॥లకు నైఋతిదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి మధ్యాహ్నము 3 గంటలకు నైఋతిదిశా మధ్య బిందువు నకు చేరుచున్నాడు. నైఋతి దిశా మధ్య బిందువు నుండి సాయంత్రము 4గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. సాయంత్రము 4గం॥30ని॥లకు పశ్చిమదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి సాయంత్రము 6 గంటలకు పశ్చిమదిశా మధ్య బిందువు నకు చేరుచున్నాడు. పశ్చిమ దిశా మధ్య బిందువు నుండి రాత్రి 7గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. రాత్రి 7గం॥30ని॥లకు వాయువ్యదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి రాత్రి 9 గంటలకు వాయువ్యదిశా మధ్య బిందువునకు చేరుచున్నాడు. వాయువ్యదిశా మధ్య బిందువు నుండి రాత్రి10గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. రాత్రి10గం॥30ని॥లకు ఉత్తరదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి రాత్రి 12 గంటలకు ఉత్తరదిశా మధ్య బిందువునకు చేరుచున్నాడు. ఉత్తరదిశా మధ్య బిందువు నుండి రాత్రి 1గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు. రాత్రి 1గం॥30ని॥లకు ఈశాన్యదిశా ప్రారంభ బిందువులో ఆరోహించి తెల్లవారుజామున 3 గంటలకు ఈశాన్యదిశామధ్య బిందువునకు చేరుచున్నాడు. ఈశాన్య దిశా మధ్య బిందువు నుండి తెల్లవారుజామున 4గం॥30ని॥ల వరకు ఆవరోహణ క్రమములో చేరుచున్నాడు.

సూర్యభగవానుడు ఏగ్రహ దిశ యందు ఉండునో ఆ అరోహణ కాలమున ఆ గ్రహముయొక్క అనుగ్రహార్థము లేదా దోషపరిహార్థము పూజా కార్యక్రమములు ఉత్తమ ఫలమును ఇచ్చును.

## రవి గ్రహ దోష శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసల్లో ఆది, మంగళ గురువారాల్లో, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్రాలు కలసి వచ్చిన రోజు వైష్ణవాలయ పూజారిని తెల్లవారురఝాము గం॥4.30 మన స్వగృమమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 1మూర గోధుమరంగు గుడ్డ పరచి 1దోసలి గోధుములుపోసి ఆ రాశిపై ఇత్తడి కలశమును పెట్టి, కలశంపై అష్టదిక్కులకు ఎనిమిది తమలపాకులుపెట్టి టెంకాయిపెట్టి, విష్ణుస్వరూపమగు మూడు పసుపు కుంకుమ రేఖలు నిలువుగాపెట్టి ఆ కలశమును తూర్పు ముఖంగా పెట్టాలి. కలశము ఎదుట ఎవ్వరూ కూర్చోనరాదు. దక్షిణాభిముఖంగా విష్ణుదేవాలయ పూజారి (అర్చకుడు) ఉత్తరాభిముఖంగా గృహస్థుడు అతని భార్య కూర్చొనాలి. ఆ తరువాత మమశని వర్గజాతస్య--లగ్నజాతకాను సారేణ--స్థాన స్థితి రవిదోషపరి హారార్థం, శతృ ఋణ రోగ పీడాపరిహారార్థం అని సంకల్పించి కలశమునకు, పురుషపూక్త, నారాయణ సూక్తములతో ఆవాహన చేసి రవి గ్రహసహిత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమ: పంచామృత అభిషేకం కరిష్యే అని చెప్పి కలశము ముందు భాగాన పెద్ద ఇత్తడి లేక రాగి తట్టలో రవి గ్రహ పంచలోహ విగ్రహమును శ్రీరామ విగ్రహము పంచలోహ లేక బంగారు విగ్రహం పెట్టి పంచామృతాలతో అభిషేకించి, పురుషసూక్త, నారాయణ సూక్తాలతో అభిషేకించి రామ సహస్రనామ, రామ అష్టోత్తరములతో, రవిఅష్టోత్తర, సహస్రనామములతో పూజలు చేయాలి. ఇట్లు సూర్యోదయకాలం వరకు ఎర్రని పుష్పాలతో గంధాక్షత లతో పూజించి ధూప,దీప,నైవేద్యమంగళ హారతులు చేయాలి (గోధుమరవ్వతో చేసిన హల్వాను నైవేద్యంగా పెట్టాలి). పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పాలి. కలశం సహితంగా గోధుమలు, ఎర్రపూలు, గోధుమ రంగు వస్త్రం 1రూ.. దక్షిణ ( ఒకటి సంఖ్య మొత్తం వచ్చుటట్లు 1,10,19,28, 37,46,55,64,73,82, 91,100 మొ.విధంగా) తంబూల సహితంగా భార్య భర్తలుచేత ధరించి మమశని వర్గ జాతస్య--లగ్న జాతకాను సారేన స్థాన స్థితి రవిదోషపరిహారార్థం శతృఋణ రోగ పీడాపరిహారార్థం దానం కరిష్యే అని ఒకసారి ఉచ్చరించి అయ్యవారి చుట్టూ ఒకసారి ప్రదక్షణచేసి అవి అన్నియు ఆయనకు దానంగాఇచ్చి సాష్టాంగ దండప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. తరువాత సూర్యోదయంకాగానే అయ్యవారిని స్వగృహం నుండా సాగనంపాలి. రవి గ్రహపీడా పరిహారార్థం చేసుకున్నది కావున తీర్థ ప్రసాదాలు తీసుకొనరాదు. తదుపరి స్నానము చేయవలెను.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమమంతయు మరియు అయ్య వారికిచ్చు దానం మొత్తం కార్యక్రమం ఉ॥గం.6.00లోపు (సూర్యోదయంలోపు) ముగించాలి.

**ముఖ్య సూచన :** శనివర్గులు రవి త్రయముతో సంబందమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పై శాంతి ఆచరించాలి. గురువర్గులు రవిత్రయముతో సంబంధమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము రవిగ్రహ దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా రవిగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్యర్థం అనిచెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే ధరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## చంద్ర గ్రహ శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో సోమ, మంగళ గురువారాల్లో రోహిణి, హస్తా, శ్రవణా నక్షత్రాలు కలిసి వచ్చిన నాడు వైష్ణవ దేవాలయ పూజారిని రాత్రి గం॥7.30 మన స్వగృహమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 6మూరల తెల్లనివస్త్రం పరచి 6 దోసిళ్ళు బియ్యం పోసి ఆరాశిపై వెండి చెంబు లేక రాగిచెంబును కలశంగా స్థాపించి కలశంపై అష్టదిక్కులకు ఎనిమిది తమలపాకులు పెట్టి టెంకాయ పెట్టి వాయువ్య ముఖముగా విష్ణుస్వరూపమగు మూడు పసుపు కుంకుమ

రేఖలు నిలువుగా పెట్టి ఆ కలశమును వాయువ్యము దిక్కుకు పెట్టిలి. కలశం ఎదురుగా ఎవ్వరూ కూర్చొనరాదు. ఈశాన్య ముఖంగా విష్ణు దేవాలయ పూజారి (అర్చకుడు) నైఋతిదిశాభి ముఖంగా గృహస్తు అతనిభార్యకూర్చొనాలి. మమశనివర్గ జాతస్య లగ్నజాతకానుసారేన -స్థాన స్థితి చంద్ర దోషపరిహారార్థం శతృఋణ రోగ పాపపరిహారార్థం అని సంకల్పించి, ఆ కలశమునకు శ్రీసూక్తం, చంద్ర గ్రహమంత్రాలను ఆవామన చేయాలి. చంద్ర గ్రహసహిత శ్రీమహాలక్ష్మీ దేవతాయైనమ: పంచామృత అభిషేకంకరిష్యే అనిచెప్పి కలశము ముందు బాగాన పెద్ద వెండి లేక రాగి లేక ఇత్తడి తట్టపెట్టి పంచామృతములతో అభిషేకించి శ్రీసూక్తముతో అభిషేకించి లక్ష్మీసహస్రనామ, లక్ష్మి అష్టోత్త రము, చంద్రగ్రహ అష్టోత్తరముతో పూజలు చేయాలి. ఇట్లు రాత్రి గం॥9.00 వరకు తెల్లనిపువ్వులతో గంధ అక్షతలతో పూజించి ధూప, దీప, నైవేద్యము, మంగళహారతులివ్వాలి. (పాలు చెక్కెర లేక పొంగలి లేక పెరుగన్నము నైవేద్యంగా పెట్టాలి.) పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పాలి. కలశ సహితంగా బియ్యము, తెల్లని పువ్వులు, తెల్లనివస్త్రం రూ. 6(దక్షిణసంఖ్య మొత్తము 6 వచ్చేటట్లు 15,24,33,42,60, 105 మొ. విధంగా) దక్షిణ తాంబూల సహితంగా భార్యాభర్తలు చేత దరించి మమ శనివర్గ జాతస్య లగ్న జాతకాను సారేన-స్థాన స్థితి చంద్ర గ్రహదోషపరిహారార్థం శతృఋణ రోగ పీడా పరిహారార్థం దానం కరిష్యే అని 6 సార్లు చెప్పి అయ్యవారి చుట్టూ 6 సార్లు ప్రదక్షిణ చేసి అవి అన్నియు ఆయనకు దానంగా ఇచ్చి షాష్టాంగ దండ ప్రణామము ఆచరించి ఆశీర్వాదము పొందాలి. తరువా రాత్రి గం॥9.00 ప్రాంత ములో అయ్య వారిని స్వగృహము నుండి సాగనంపాలి. చంద్ర గ్రహ పీడా పరిహారార్థము చేసుకున్నది కావున తీర్థప్రసాదములు స్వీకరించ రాదు. తదుపరి స్నానము చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యవారికిచ్చు దానం కార్యక్రమము రాత్రి గం॥9.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** శనివర్గులు చంద్ర త్రయముతో సంబంధమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పై శాంతి ఆచరించాలి. గురువర్గులు చంద్రత్రయముతో సంబంధమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము చంద్రగ్రహ దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా చంద్రగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం , కలశము దానము చేయరాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## కుజ గ్రహ శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో ఆది, సోమ, మంగళ, గురు వారాల్లో మృగశిర, చిత్తా, ధనిష్ఠా నక్షత్రాలు కలసి వచ్చినరోజు వైష్ణవాలయ పూజారిని ఉదయం గం॥10.30 లకు మన స్వగృహము నకు పిలిపించి గృహమధ్య హాలులో మూడు మూరల ఎర్రని వస్త్రము పరచి 3దోసిల్లు కందులుపోసి రాశిపై రాగిచెంబుకు కలశంగా స్థాపించి కలశముపై అష్టదిక్కులకు 8తమలపాకులు పెట్టి పైన టెంకాయ పెట్టి ఆ కలశమునకు విష్ణుస్వరూపమగు 3 పసుపు కుంకుమ రేఖలు నిలు వుగాపెట్టి ఆ కలశమును దక్షిణ దిశాముఖంగా పెట్టాలి. కలశము ఎదుట ఎవ్వరుకూర్చొనరాదు. తూర్పు ముఖంగా విష్ణుదేవాలయ పూజారి (అర్చకుడు) కూర్చోనాలి. పశ్చిమాభిముఖంగా గృహస్థుడు అతని భార్య కూర్చొనాలి. తరువాత మమ శనివర్గజాతస్య లగ్నజాత కానుసారేన-స్థాన స్థితి కుజ గ్రహ దోషపరిహారార్థం, శతృఋణరోగ పీడ పరిహారార్థం అని సంకల్పించి, ఆ కలశమునకు ఆంజనేయ స్వామి కుజగ్రహ మంత్రాలను ఆవాహనచేసి, కుజగ్రహ సహిత శ్రీఆంజనేయస్వామినే నమః, పంచామృతాభిషేకం కరిష్యే అని చెప్పి కలశం ముందుభాగాన పెద్ద రాగి తట్టలో కుజ గ్రహ పంచలోహ విగ్రహము హనుమాన్ పంచలోహ విగ్రహం పెట్టి పంచామృతములతో అభిషేకించి, హనుమాన్ సహస్రనామము, అష్టోత్తరాలతో కుజగ్రహ అష్టోత్తరాలతో పూజలు చేయాలి. మధ్యాహ్నం గం॥12.00 వరకు ఎర్రని పూలు, సింధూరముతో గంధాక్షతలతో పూజించి ధూప, దీప, నైవేద్య, మంగళహారతులు ఇవ్వాలి. (3రకాలపండ్లు నైవేద్యంగా పెట్టాలి) పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పాలి. కలశ సహితంగా కందులు ఎర్రనిపూలు, ఎర్రనివస్త్రం, రూ. 3(దక్షిణ మొత్తం 3వచ్చునట్లు 3, 12,21,30,102, 111 మొ॥ విధంగా) దక్షిణ తాంబూల సహితంగా భార్యభర్తలచేత ధరించి మమ శనివర్గ జాతస్య- లగ్న జాతకాను సారేన-స్థాన స్థితి కుజదోష పరిహారార్థం, శతృఋణరోగ పీడా పరిహారా ర్థం దానం కరిష్యే అనిమూడుసార్లుచెప్పి అయ్యవారిచుట్టూ 3 సార్లు ప్రదక్షిణచేసి అవన్నియూ అయనకు దానంగా ఇచ్చి షాష్టంగ దండ ప్రమాణం ఆచరించి ఆశీర్వాదం పొందాలి. తరువాత మధ్యాహ్నం గం. 12.00 అయ్యవారిని స్వగృహమునుండి సాగనంపాలి. కుజ గ్రహ పీడా పరిహారార్థం చేసినది కావున తీర్థ ప్రసాదాలు స్వీకరించరాదు. తదుపరి స్నానము చేయ్యాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యవారికిచ్చు దానం కార్యక్రమము మధ్యాహ్నం గం॥12.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** శనివర్గులు కుజత్రయముతో సంబందమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పై శాంతి ఆచరించాలి. గురువర్గులు కుజత్రయముతో సంబందమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము కుజగ్రహ దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా కుజగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## రాహు గ్రహ దోష శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో శని, బుధ, శుక్రవారాల్లో ఆరుద్ర, స్వాతి, శతభిష నక్షత్రాలు కలసి వచ్చిన రోజు శైవ దేవాలయ పూజారిని మధ్యాహ్నం గం॥1.30లకు మన స్వగృహమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 4 మూరలపొగ రంగు వస్త్రము పరచి 4 దోసిల్లు నల్ల మినుములు (ఉద్దులు)పోసి ఆ రాశిపై అల్యూమినియం లేక వెండి లేక స్టీలు చెంబును కలశంగా స్థాపించి కలశంపై అష్టదిక్కులకు 8 తమలపాకులుపెట్టి పైన టెంకాయపెట్టి శివ స్వరూపమగు 3 విభూది రేకులు అడ్డంగా పెట్టి ఆ కలశం పై నైఋతి దిశా ముఖంగా పెట్టాలి. కలశం ఎదుట ఎవ్వరు కూర్చొనరాదు అగ్నేయ ముఖంగా శివాలయం పూచారి వాయువ్య ముఖంగా గృహస్థుడు అతని భార్య కూర్చొనాలి.

తరువాత తమ గురువర్గ జాతస్య-లగ్నజాతకానుసారేన-స్థాన స్థితి రాహు దోష పరిహారార్థం శతృఋణరోగపీడా పరిహారార్థం అని సంకల్పించి తమ ఆ కలశమునకు సుబ్రమణ్యస్వామి మంత్రముతో రాహు గ్రహ మంత్రములతో ఆవాహనచేసి రాహు గ్రహ సహిత సుబ్రమణ్య స్వామినే నమః, పంచామృతాభిషేకం కరిష్యే అనిచెప్పి కలశం ముందు భాగాన పెద్ద అల్యూమినియం లేక వెండి లేక స్టీలు తట్టలో రాహు గ్రహ పంచలోహ విగ్రహము శ్రీసుబ్రమణ్యస్వామి విగ్రహము పంచ లోహ లేక వెండి విగ్రహంపెట్టి పంచామృతములతో అభిషేకించి సుబ్రమణ్యస్వామి అష్టోత్తర సహస్రనామములతో రాహు అష్టోత్తరాలతో మధ్యాహ్నం గం॥3.00 వరకు పూజా పుష్ప గంధాక్షతలతో పూజించి ధూపదీప నైవేద్యములతో మంగళహారతులు ఇవ్వాలి (నేరుడు పండు లేదా మినుములు గుగ్గిళ్ళు నైవేద్యంగా పెట్టాలి.). పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పాలి. కలశ సహితంగా నల్ల మినుమ గుగ్గిళ్ళు (ఉద్దులు)పూలు నస్యపు రంగు వస్త్రము రూ. 4 దక్షిణ (దక్షిణ సంఖ్య మొత్తము 4వచ్చు విధంగా 4,13,22,31,40 మొ॥విధంగా) తాంబూల సహితంగా భార్య భర్తలచేత ధరించి మమ గురు వర్గజాతస్య లగ్న జాతకానుసారేన-స్థాన స్థితి రాహు గ్రహం దోష పరిహారార్థం, శతృఋణ రోగ పీడ పరిహారార్థం దానంకరిష్యే అని4సార్లు ఉచ్చరించి అయ్యవారి చుట్టూ 4 సార్లు ప్రదక్షణలు చేసి అవి అన్నియూ ఆయనకు దానంగా యిచ్చి షాష్టంగదండ ప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. తరువాత మధ్యాహ్నం గం॥3.00ల ప్రాంతములో అయ్య వారిని స్వగృహమునుండి సాగనంపాలి. రాహు గ్రహ పీడాపరిహారార్థం చేసుకున్నది కావున తీర్థప్రసాదములు స్వీకరించరాదు. తదుపరి స్నానము చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యావారికిచ్చు దానం కార్యక్రమము మధ్యాహ్నం గం॥3.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** రాశి కుండలిలో శనివర్గులకు రాహువుగ్రహము తన స్థితి యుతి వీక్షణలరీత్యా తన వర్గీయులగు శని బుధ శుక్రుల క్షేత్రాలను ఎవరిని బలంగా సంబంధించియుండునో ముందుగా గమనించి ఆ తరువాత వారి త్రయముతో సంబందించిన శుభాశుభ గ్రహములయొక్క దశాంతర్దశా విదశలు జరుగుచున్న అనుగ్రహార్థమై పై పూజను ఆచరించాలి. పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము రాహుగ్రహ దోషపరిహారార్థం శత్రు ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా రాహుగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం ,కలశము దానము చేయ రాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

గురువర్గులు దోషపరిహారార్థమై పై పూజను ఆచరించాలి.

## గురు గ్రహ దోష శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో 1. ఆది, 2. సోమ, 3. మంగళ, 4. గురువారాల్లో పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలు కలసి వచ్చిన రోజు వైష్ణవాలయం పూజారిని రాత్రి గం॥1.30 లకు మన స్వగృహమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 9 మూరల పసుపు వస్త్రం పరచి 9 దోసిళ్ళు శెనగలు పోసి ఆ రాశిపై బంగారు లేక ఇత్తడి చెంబును కలశంగా స్థాపించి, కలశంపై అష్టదిక్కులకు 8 తమలపాకులను పెట్టి, వాటిపై టెంకాయనుపెట్టి, విష్ణు స్వరూపమగు పసుపు కుంకుమ రేఖలు నిలువగాపెట్టి ఆ కలశం ఈశాన్య దిశాభిముఖంగా పెట్టాలి. కలశం ఎదుట ఎవ్వరూ కూర్చొనరాదు. వాయువ్య ముఖంగా వైష్ణవాలయ పూజారిని(అర్చకుడు) ఆగ్నేయముఖంగా గృహస్థుడు అతనిభార్య కూర్చొనాలి. తరువాత మమ శనివర్గ జాతస్య-లగ్నజాతకానుసారేన-స్థాన స్థితి గురు గ్రహదోష పరిహారార్థం, శత్రు ఋణరోగపీడ పరిహారార్థం అని సంకల్పించి ఆ కలశమునకు పురుష సూక్త, నారాయణసూక్తాలతో ఆవాహన చేసి గురుగ్రహసహిత శ్రీకృష్ణపర బ్రహ్మణేనమ: పంచామృత అభిషేకంకరిష్యే అనిచెప్పి కలశము ముందు భాగాన ఇత్తడి తట్టలో గురు గ్రహ పంచలోహ విగ్రహము మరియు శ్రీ కృష్ణుని బంగారు లేక పంచలోహవిగ్రహము పెట్టి పంచామృతములతో అభిషేకించి, పురుషసూక్త, నారాయణ సూక్తములతో, అభిషేకించి కృష్ణసహస్రనామ, అష్టోత్తరములతో గురుఅష్టోత్తరముతో పూజలు చేయాలి. ఇట్లు రాత్రి గం॥3.00వరకు పసుపు పువ్వులతో గందాక్షతలతో పూజించి ఉద్వాసన చెప్పాలి. కలశ సహితంగా శెనగలు పసుపు పూలు పసుపు రంగు వస్త్రం రూ. 9 దక్షిణ (దక్షిణ మొత్తము సంఖ్య 9 వచ్చునట్లు 9,18,27,36,45,54,63,72,81,90,108మొ॥ విధంగా) సహితంగా భార్యాభర్తలు చేత చేసి అవి అన్నియు ఆయనకు దానంగా ఇచ్చి సాష్టాంగదండప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. తరువాత రాత్రి గం॥3.00 ప్రాంతాన అయ్య వారిని స్వగృహమును నుండి సాగనంపాలి. గురు గ్రహ పీడాపరిహారార్థం చేసినది కావున తీర్థప్రసాదములు తీసుకొనరాదు. తదుపరి స్నానము చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యావారికిచ్చు దానం కార్యక్రమము రాత్రి గం॥3.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** శనివర్గులు గురుత్రయముతో సంబందమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పై శాంతి ఆచరించాలి. గురువర్గులు గురుత్రయముతో సంబందమున్న దశాంతర్దశా విదశలు జరుగుచున్నపుడు పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము గురుగ్రహ దోషపరిహారార్థం శత్రు ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా గురుగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## శని గ్రహ దోష శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో శని, బుధ, శుక్రవారాల్లో పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలు కలసి వచ్చిన రోజు శివాలయ పూజారిని సాయంత్రము గం॥4.30 లకు మన స్వగృహమునకు పిలిపించి గృహమధ్య హాలులో 5 మూరల నల్లని వస్త్రము పరచి నల్ల పూవ్వులు 5 దోసిళ్ళుపోసి ఆరాశిపై స్టీలు (ఇనుము) కలశం స్థాపించి ఆ కలశంపై అష్టదిక్కులకు 8 తమలపాకులుపెట్టి ఆ కలశమునకు శివ స్వరూపమగు మూడు విభూది రేఖలు అడ్డంగాపెట్టి ఆ కలశము పడమర దిశాభిముఖంగా పెట్టాలి. కలశము ఎదురుగా ఎవ్వరూ కూర్చొనరాదు. ఉత్తరాభిముఖంగా శివాలయ పూజారిని (అర్చకుడు) దక్షిణాభిముఖంగా గృహస్తుడు అతని భార్య కూర్చొనాలి. ఆ తరువాత మమ గురువర్గ జాతస్య-లగ్న జాతకానుసారేన-స్థాన స్థితి శని దోష

పరిహారార్థం శత్రు ఋణ రోగ పీడ పరిహారార్థం అని సంకల్పించి ఆ కలశమునకు నమక, చమక, ఈశ్వరమంత్రాలు, శనైశ్వర మంత్రాలతో ఆవాహన చేసి, శనైశ్వర సహిత సాంబశివాయనమ: రుద్రాభిషేకం కరిష్యే అనిచెప్పి, కలశము ముందుభాగాన పెద్ద స్టీలుతట్టలో శనైశ్వరుని పంచలోహ విగ్రహమును, శివలింగము (చిన్నసైజు లింగము) పెట్టి పంచామృతాలతో అభిషేకించి, రుద్రనమకచమకాలతో అభిషేకించి శివాష్టోత్తర, సహస్రనామాలతోను, శనిఅష్టోత్తరములతో పూజాదులు చేయాలి. ఇట్లు సూర్యాస్తమయకాలం వరకు జమ్మిఆకులు, నీల పుష్పాలు, విభూది, గంధాక్షతలతోపూజించి ధూప,దీప,నైవేద్య మంగళ హారతులు ఇవ్వాలి. (నువ్వుల పిండి నైవేద్యంగా పెట్టాలి) పై విధంగా పూజించి ఉద్వాసనచెప్పి, కలశము సహితంగా, నల్లనువ్వులు, జమ్మి పత్రి, విభూతి, నల్లని వస్త్రంలో రూ. 5 దక్షిణ (దక్షిణ మొత్తం సంఖ్య 5 వచ్చునట్లు 5,14,23,32,41,50,68,77,104 మొ॥ విధంగా) తాంబూల సహితంగా భార్య భర్తలుచేత ధరించి మమగురు వర్గ జాతస్య-లగ్నజాతకానుసానేన-స్థితి స్థాన శనిదోష పరిహారార్థం, శత్రు ఋణరోగ పీడ పరిహారార్థం దానం కరిష్యే అని 5 సార్లు ఉచ్చరిస్తూ అయ్య వారి చుట్టూ 5 సార్లు ప్రదక్షణ చేసి అవి అన్నియూ ఆయనకు దానంగా ఇచ్చి షాష్టాంగ దండప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. సాయంత్రముగం॥ 6.00సూర్యాస్తమయకాలాన అయ్య వారిని స్వగృహం నుండి సాగనంపాలి. పీడాపరిహారార్థం చేసినది కావున తీర్థ ప్రసాదాలు తీసుకొనరాదు. తదుపరి స్నానం చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యావారికిచ్చు దానం కార్యక్రమము సాయంకాలము గం॥ 6.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** గురువర్గులు శనిత్రయముతో సంబంధమున్న దశాంతర్ధశా విదశలు జరుగుచున్నపుడు పైశాంతి ఆచరించాలి. శనివర్గులు శనిత్రయముతో సంబందమున్న దశాంతర్ధశా విదశలు జరుగుచున్నపుడు పురోహితునిద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము శనిగ్రహ దోషపరిహారార్థం శత్రు ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా శనిగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే ధరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## బుధ గ్రహ శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో శని, బుధ, శుక్రవారాల్లో ఆశ్లేషా, జ్యేష్టా, రేవతి నక్షత్రాలుకలసి వచ్చినరోజు శైవపూజారిని రాత్రి గం॥ 10.30లకు మనస్వగృహమునకు పిలిపించి గృహమధ్య హాలులో 7 మూరల ఆకుపచ్చని వస్త్రము పరచి 7 దోసిళ్ళు ఆకుపచ్చని పెసలు పోసి ఆరాశిపె వెండి లేక అల్యూమినియం చెంబును కలశంగా స్థాపించి ఆ కలశంపై అష్టదిక్కులకు 8తమలపాకులుపెట్టి ఆ కలశము నకు శివస్వరూపమగు మూడు విభూదిరేఖలు అడ్డంగా పెట్టి ఆ కలశము ఉత్తర దిశాభిముఖంగా పెట్టాలి. కలశము ఎదురుగా ఎవ్వరూ కూర్చొనరాదు. పశ్చిమాభిముకంగా శివాలయ పూజారిని (అర్చకుడు) తూర్పు దిశాభిముఖంగా గృహస్తుడు అతనిభార్య కూర్చొనాలి. ఆ తరువాత మమ గురువర్గ జాతస్య-లగ్న జాతకానుసారేన-స్థాన స్థితి బుధ దోష పరిహారార్థం శత్రు ఋణ రోగ పీడపరిహారార్థం అని సంకల్పించి ఆ కలశమునకు గణపతి సూక్తి, బుధ గ్రహ మంత్రాలతో ఆవాహన చేసి, బుధగ్రహసహిత విఘ్నేశ్వరాయనమః పంచామృతం అభిషేకం కరిష్యే అనిచెప్పి కలశము ముందు భాగాన వెండి లేక అల్యూమినియం తట్ట ఉంచి బుధ గ్రహ పంచలోహ విగ్రమము పెట్టి పంచామృతముతో అభిషేకించి, గణపతిసూక్తముతో అభిషేకించి గణపతి సహస్ర, అష్టోత్తరాలతో బుధగ్రహ అష్టోత్తరములతో పూజ చేయాలి. ఇట్లు రాత్రి గం॥ 12.00 వరకు గందాక్షతలతో పూజించి దూప, దీప, నైవేద్య మంగళహారతులు ఇవ్వాలి. (పెసర గుగ్గిళ్ళు లేక కుడుములు నైవేద్యం చేయాలి.) పైవిధంగా పూజించి ఉద్వాసన చెప్పి కలశము సహితంగా, పెసలు, పూలు, ఆకుపచ్చవస్త్రం రూ. 7 దక్షిణ (దక్షిణ మొత్తము సంఖ్య 7వచ్చు విధంగా7,16,25,34,43,52,61, 70 మొ॥ విధంగా) తాంబూల సహితంగా భార్యభర్తలు చేత దరించి మమగురువర్గ జాతస్య-లగ్న జాతకానుసారేన-స్థాన స్థితి బుధ దోష పరిహారార్ధం, శత్రుఋణ రోగ పీడ పరిహారార్థం దానం కరిష్యే అని చెప్ప 7సార్లు ప్రదక్షిణచేసి అవి అన్నియు ఆయనకు దానంగా ఇచ్చి సాష్టాంగ దండ ప్రణామము ఆచరించి ఆశీర్వాదం పొందాలి. రాత్రి గం॥ 12.00లకు అయ్యవారిని స్వగృహము నుండి సాగనంపాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యావారికిచ్చు దానం కార్యక్రమము రాత్రి గం॥ 12.00 లోపుగా ముగించాలి.

**ముఖ్యసూచన :** గురువర్గులు బుధత్రయముతో సంబంధమున్న దశాంత ర్ధశా విదశలు జరుగుచున్నపుడు పై శాంతి ఆచరించాలి. శనివర్గులు బుధత్రయముతో సంబంధమున్న దశాంతర్ధశా విదశలు జరుగుచున్న పుడు పురోహితుని ద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము బుధగ్రహ దోషపరిహారార్థం శత్రు ఋణ రోగపీడాపరిహారార్థం అన్నదానికి బదులుగా బుధగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్యర్థం అని చెప్పాలి. ధాన్యము,వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే ధరించి ధాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

## కేతు గ్రహ శాంతి విధానము

మేష, సింహ, ధనుర్మాసాల్లో ఆది,సోమ,మంగళ, గురువారాల్లో అశ్విని ముఖ, మూలా నక్షత్రాలు కలసి వచ్చిన రోజు వైష్ణవాలయ పూజారిని రాత్రి గం॥ 1.30లకు మన స్వగృహమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 8 మూరల చిత్ర వర్ణ రంగు వస్త్రము (రంగు రుంగుల వస్త్రము) పరచి 8 దోసిళ్ళు ఉలవలు పోసి ఆరాశిపై ఇత్తడి చెంబును కలశం స్థాపించి ఆ కలశంపై అష్టదిక్కులకు 8 తమలపాకులు పెట్టి ఆ కలశమునకు విష్ణుస్వరూపమగు మూడు పసుపు కుంకుమ రేఖలు నిలువుగాపెట్టి ఆకలశము ఈశాన్య దిశాభిముఖంగా పెట్టాలి. కలశము ఎదురుగా ఎవ్వరూ కూర్చొనరాదు. వాయువ్యముఖంగా విష్ణు దేవాలయ పూజారి (అర్చకుడు) ఆగ్నేయముఖంగా గృహస్తుడు అతని భార్య కూర్చొనాలి. ఆతరువాత మమ శనివర్గ జాతస్యలగ్న జాతకాను సారేన-స్థాన స్థితి కేతు దోషపరిహారార్థం శత్రు ఋణ రోగ పీడ పరిహారార్థం అని సంకల్పించి ఆ కలశమునకు పురుష సూక్తము, నారాయణ సూక్త కేతుగ్రహ మంత్రాలతో ఆవాహనచేసి, కేతుగ్రహ సహిత శ్రీమన్నా రాయణాయనమః పంచామృత అభిషేకం కరిష్యే అని చెప్పి, కలశము ముందుభాగాన పెద్ద ఇత్తడి తట్ట పెట్టి కేతు గ్రహ పంచలోహ విగ్రహము శ్రీమన్నారాయణ స్వామి పంచలోహ లేక బంగారు విగ్రహముపెట్టి పంచామృతాలతో అభిషేకించి, విష్ణు సహస్రనామ అష్టోత్తరాలతో కేతు

గ్రహ అష్టోత్తరములతో పూజాదులు చేయాలి. ఇట్లు రాత్రి గం॥3.00 వరకు పుష్ప,గంధాక్షతలతో పూజించి దూప, దీప, నైవేద్య మంగళహారతులు ఇవ్వాలి. (ఆవుపాలు లేక తులసి తీర్థము నైవేద్యంగా పెట్టాలి) పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పి కలశము సహితంగా, ఉలవలు, పూలు, చిత్రవర్ణం వస్త్రం రూ. 8 దక్షిణ (దక్షిణ మొత్తం సంఖ్య 8వచ్చునట్లు 8,17,26,35,44,62,71,80మొ॥ విధంగా) తాంబూల సహితంగా భార్యభర్తలు చేతధరించి మమశని వర్గ జాతస్య-లగ్నజాతకానుసానేన-స్థితి స్థాన కేతు దోషపరిహారార్థం, శతృ ఋణ రోగ పీడ పరిహారార్థం దానం కరిష్యే అని8సార్లు ఉచ్చరిస్తూ అయ్యవారి చుట్టూ 8 సార్లు ప్రదక్షణచేసి అవి అన్నియూ ఆయనకు దానంగా ఇచ్చి సాష్టాంగ దండ ప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. రాత్రి గం॥3.00 అయ్యవారిని స్వగృహం నుండి సాగనంపాలి. కేతు గ్రహపీడాపరిహారార్థం చేసినది కావున తీర్థ ప్రసాదాలు తీసుకొనరాదు. తదుపరి స్నానం చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యవారికిచ్చు దానం కార్యక్రమము రాత్రి గం॥3.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** రాశి కుండలిలో గురువర్గులకు కేతుగ్రహము తన స్థితి యుతి వీక్షణలరీత్యా తన వర్గీయులగు రవి చంద్ర కుజ గురుల క్షేత్రాలను ఎవరిని బలంగా సంబందించియుండునో ముందుగా గమనించి ఆ తరువాత వారిత్రయముతో సంబందించిన శుభాశుభ గ్రహములయొక్క దశాంతర్ధశా విదశలు జరుగుచున్న అనుగ్రహార్థమై పై పూజను ఆచరించాలి. పురోహితునిద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము కేతుగ్రహ దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా కేతుగ్రహ అనుగ్రహార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి. శనివర్గులు దోషపరిహారార్థమై పై పూజను ఆచరించాలి.

## శుక్ర గ్రహ దోష శాంతి విధానము

మేష, సింహ, ధనుర్ మాసాల్లో శుక్ర, బుధ, శనివారాల్లో భరణి, పుబ్బ, పూర్వాషాడా నక్షత్రాలు కలసి వచ్చిన రోజు శైవదేవాలయ పూజారిని ఉదయము గం॥7.30లకు మన స్వగృహమునకు పిలిపించి గృహ మధ్య హాలులో 2 మూరల ముతక తెలుపు రంగు వస్త్రము పరచి 2దోసిళ్ళనల్ల అనుములుపోసి ఆరాశిపై వెండి లేక అల్యూమినియం చెంబును కలశం స్థాపించి ఆ కలశంపై అష్టదిక్కులకు 8 తమల పాకులుపెట్టి ఆ కలశమునకు శివస్వరూపమగు మూడు విభూది రేఖలు అడ్డంగా పెట్టి ఆ కలశము ఆగ్నేయ దిశాభిముఖంగా పెట్టాలి. కలశము ఎదురుగా ఎవ్వరూ కూర్చొనరాదు. నైఋతి దిశా ముఖంగా శైవ దేవాలయ పూజారిని (అర్చకుడు) ఈశాన్య ముఖంగా గృహస్తుడు అతనిభార్య కూర్చొనాలి. ఆ తరువాత మమ గురు వర్గ జాతస్య-లగ్న జాతకానుసారేన-స్థాన స్థితి శుక్ర దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడ పరిహారార్థం అని సంకల్పించి ఆ కలశమునకు దుర్గాసూక్తము, శుక్ర గ్రహ మంత్రాలతో ఆవాహన చేసి, శుక్ర గ్రహ సహిత శ్రీదుర్గా దేవతాయైనమ: పంచామృత అభిషేకం కరిష్యే అని చెప్పి, కలశము ముందు భాగాన వెండి లేక అల్యూమినియం తట్టపెట్టి శుక్ర గ్రహ పంచలోహ విగ్రహము దుర్గాదేవి బంగారు లేక వెండి లేక పంచలోహ విగ్రహము పెట్టి పంచామృతాలతో అభిషేకించి, లలిత సహస్రనామ అష్టోత్తరాలతో శుక్ర గ్రహ అష్టోత్తరములతో పూజాదులు చేయాలి. ఇట్లు ఉదయం గం॥7.00 వరకు తెల్లని పుష్పాలు, గంధాక్షతలతో పూజించి దూప, దీప, నైవేద్య మంగళహారతులు ఇవ్వాలి. (అనుము గుగ్గులు లేక తేనే నైవేద్యంగా పెట్టాలి) పై విధంగా పూజించి ఉద్వాసన చెప్పి కలశము సహితంగా, అనుములు తెల్లనిపూలు, ముతక తెలుపు వస్త్రం, వస్త్రం రూ. 2 దక్షిణ (దక్షిణ మొత్తం సంఖ్య 2 వచ్చునట్లు 2, 11,20,29,38,47,74 మొ॥ విధంగా) తాంబూల సహితంగా భార్య భర్తలుచేతధరించి మమ గురువర్గ జాతస్య-లగ్న జాతకానుసానేన-స్థితి స్థాన శుక్ర దోష పరిహారార్థం, శతృఋణ రోగపీడ పరిహారార్థం దానం కరిష్యే అని 2 సార్లు ఉచ్చరిస్తూ అయ్యవారి చుట్టూ 2 సార్లు ప్రదక్షణ చేసి అవిఅన్నియూ ఆయనకు దానంగాఇచ్చి సాష్టాంగ దండ ప్రణామములు ఆచరించి ఆశీర్వాదం పొందాలి. ఉదయం గం॥9.00 అయ్యవారిని స్వగృహం నుండి సాగనంపాలి. శుక్ర గ్రహ పీడాపరిహారార్థం చేసినది కావున తీర్థప్రసాదాలుతీసుకొనరాదు. తదుపరిస్నానం చేయాలి.

**గమనిక :** ఈ పూజా కార్యక్రమము మరియు అయ్యవారికిచ్చు దానం కార్యక్రమము ఉదయం గం॥9.00 లోపుగా ముగించాలి.

**ముఖ్య సూచన :** గురువర్గులు శుక్రత్రయముతో సంబందమున్న దశాంతర్ధశా విదశలు జరుగుచున్నపుడు పైశాంతి ఆచరించాలి. శని వర్గులు శుక్రత్రయముతో సంబంధమున్న దశాంతర్ధశా విదశలు జరుగుచున్నపుడు పురోహితునిద్వారా కాకుండా స్వయంగా పూజా కార్యక్రమము ఆచరించాలి. సంకల్పము శుక్రగ్రహ దోషపరిహారార్థం శతృ ఋణ రోగ పీడా పరిహారార్థం అన్నదానికి బదులుగా శుక్రగ్రహ అనుగ్రహారార్థం ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్యర్థం అని చెప్పాలి. ధాన్యము, వస్త్రం, కలశము దానము చేయరాదు. వస్త్రం తానే దరించి దాన్యం తనే భుజించాలి. అనుగ్రహారార్థం చేసిన పూజ కావున తదుపరి స్నానము చేయరాదు. తీర్థప్రసాదాలు స్వీకరించాలి.

**గమనిక :** పూజా శాంత్యాదులు పై కాలములనందు చేయుటకు వీలు కానప్పుడు గురువర్గ గ్రహములగు రవి చంద్ర కుజ గురు కేతు గ్రహములకు తెల్లవారుఝామున గం॥4.30ని॥ల నుండి ఉదయము గం॥6.00 లోపు ఆ గ్రహముల స్వకాలము, మిత్ర కాలమైన రవి కాలము నందు ఆచరించవచ్చును. శనివర్గ గ్రహములగు శని బుధ శుక్ర రాహువు గ్రహములకు సాయంకాలము గం॥4.30ని॥ల నుండి సాయంకాలము గం॥6.00లోపు ఆ గ్రహముల స్వకాలము, మిత్ర కాలమైన శని కాలము నందు ఆచరించవచ్చును.

## శాంతి విధానము సంక్షిప్తంగా

**శుభ రత్న, దిశా, రంగు, సంఖ్య, డాలర్,**

**శుభగ్రహ బలము పెరుగుటకు దేవతోపాసన**

**( మేష, కర్కాటక, సింహ, వృశ్చిక, ధనుర్, మీన లగ్నములైన గురు వర్గ జాతకులకు)**

**1. శుభ రత్నాలు :** కనకపుష్యరాగం, పగడం, ముత్యం, కెంపు కుడిచేతి చూపుడు వ్రేలుకు మరియు ఉంగరపు వ్రేలుకు ఉంగరంగా ధరించాలి.

**2. శుభ రంగులు :** పసుపు, తెలుపు, ఎరుపు, గోధుమ రంగు దుస్తులు ధరించాలి.

**3. శుభ సంఖ్యలు :** 1,3,6,8,9

**4. శుభ దిక్కులు (నివాస, వ్యాపారాలకు) :** తూర్పు, దక్షిణము.

**5. శుభ డాలర్ :** మేష, వృశ్చిక లగ్నజులకు హనుమాన్ డాలర్, కర్కాటక లగ్నజులకు లక్ష్మీ డాలర్, సింహ లగ్నజులకు శ్రీ రామ లేదా వెంకటేశ్వర డాలర్, ధనుర్, మీన లగ్నజులకు శ్రీ కృష్ణుని డాలర్ ధరించాలి.

**6. శుభ గ్రహ బలము పెరుగుటకు పూజించవలసిన దేవతలు:** శ్రీ కృష్ణ, మహాలక్ష్మీ, హనుమాన్, శ్రీ రామ, శ్రీ రంగనాయక స్వామి.

**7. శాంతి చేసుకోవలసిన పాప గ్రహాలు :** శని, శుక్ర, బుధ, రాహువు.

**8. అనారోగ్యము కలిగినప్పుడు భుజించవలసిన ధాన్యము :** పరిగడుపున మొలకలు వచ్చిన కందులు లేదా శనగలు.

**9. శుభ మాసాలు :** డిసెంబర్, మార్చి, జూన్, సెప్టెంబర్.

### శని గ్రహ శాంతి విధానము

పుష్యమి నక్షత్రము రోజున లేదా శనివారము రోజు సాయంత్రం 4.30 ని॥ల నుండి 6.00 గం॥లోపు నువ్వులు, బెల్లము దంచి నువ్వుల పిండిచేసి జాతకుడు తూర్పు దిశాభిముఖంగా కూర్చుని, నువ్వుల పిండిని ఐదు సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన నువ్వుల పిండి నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### బుధ గ్రహ శాంతి విధానము

జేష్ఠ నక్షత్రము రోజున లేదా బుధవారము రోజు రాత్రి 10.30 ని॥ల నుండి 12.00 గం॥లోపు పెసలు గుగ్గుళ్ళుగా చేసి జాతకుడు దక్షిణ దిశాభిముఖంగా కూర్చుని, పెసరగుగ్గుళ్ళు ఏడు సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన పెసరగుగ్గుళ్ళు నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### శుక్ర గ్రహ శాంతి విధానము :

భరణి నక్షత్రము రోజున లేదా శుక్రవారము రోజు ఉదయం 7.30 ని॥ల నుండి 9.00 గం॥లోపు అనుములను గుగ్గుళ్ళుగా చేసి జాతకుడు వాయువ్య దిశాభిముఖంగా కూర్చుని, అనుముగుగ్గిళ్ళను రెండు సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన అనుముగుగ్గిళ్ళ నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### రాహువు గ్రహ శాంతి విధానము :

పుష్యమి, జేష్ఠా, భరణి నక్షత్రము రోజున లేదా శని, బుధ, శుక్రవారము రోజు సాయంత్రం 4.30 ని॥ల నుండి 6.00 గం॥లోపు ఉద్దులును ఉడికించి ఉద్దిగుగ్గుళ్ళు చేసి జాతకుడు ఈశాన్యం దిశాభిముఖంగా కూర్చుని, ఉద్దిగుగ్గుళ్ళను నాలుగు సార్లు దిగదీయించుకొని, ఆ ఉద్దిగుగ్గుళ్ళు నల్లని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

## (వృషభ, మిధున, కన్య, తుల, మకర, కుంభ లగ్నములైన శని వర్గ జాతకులకు)

**1. శుభ రత్నాలు :** నీలం, పచ్చ, వజ్రం కుడి చేయి మధ్య వ్రేలికి ఉంగరంగా ధరించాలి..

**2. శుభ రంగులు :** నీలం, ఆకుపచ్చ, తెలుపు రంగు దుస్తులు ధరించాలి.

**3. శుభ సంఖ్యలు :** 2, 4, 5, 7.

**4. శుభ దిక్కులు (నివాస, వ్యాపారాలకు) :** ఉత్తర, పశ్చిమము.

**5. శుభ డాలర్ :** వృషభ, తుల లగ్నజులకు దుర్గాదేవీ డాలర్, మిధున, కన్య లగ్నజులకు గణపతి డాలర్, మకర, కుంభ లగ్నజులకు శివుని డాలర్ ధరించాలి.

**6. శుభ గ్రహ బలము పెరుగుటకు పూజించవలసిన దేవతలు :** శివ, దుర్గా, గణపతి, సుబ్రహ్మణ్యస్వామి.

**7. శాంతి చేసుకోవలసిన పాప గ్రహాలు :** రవి, చంద్ర, కుజ, గురు, కేతు.

**8. అనారోగ్యము కలిగినప్పుడు భుజించవలసిన ధాన్యము :** పరిగడుపున మొలకలు వచ్చిన పెసలు.

**9. శుభ మాసాలు :** జనవరి, ఫిబ్రవరి, జులై, ఆగష్టు.

### రవి గ్రహ శాంతి విధానము

ఉత్తరాషాఢ నక్షత్రము రోజున లేదా ఆదివారము రోజు తెల్లవారుజామున 4.30 ని॥ల నుండి 6.00 గం॥లోపు గోధుమ రవ్వ, బెల్లము కలిపి గోధుమ హల్వాగా తయారు చేసి జాతకుడు పశ్చిమ దిశాభిముఖంగా కూర్చుని, గోధుమ హల్వాను ఒక సారి దిగదీయించుకొని, ఆ దిగదీసిన గోధుమ హల్వాను ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### చంద్ర గ్రహ శాంతి విధానము

శ్రవణ నక్షత్రము రోజున లేదా సోమవారము రోజు రాత్రి 7.30 ని॥ల నుండి 9.00 గం॥లోపు బియ్యము, పాలు, బెల్లము కలిపి తీపి పొంగలిగా తయారుచేసి జాతకుడు ఆగ్నేయ దిశాభిముఖంగా కూర్చుని, తీపి పొంగలిని ఆరుసార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన తీపి పొంగలిను ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### కుజ గ్రహ శాంతి విధానము

చిత్త నక్షత్రము రోజున లేదా మంగళవారము రోజు ఉదయము 10.30 ని॥ల నుండి 12.00 గం॥లోపు కందులు ఉడికించి కంది గుగ్గుళ్ళు తయారు చేసి జాతకుడు ఉత్తర దిశాభిముఖంగా కూర్చుని, కందిగుగ్గుళ్ళు మూడుసార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన కంది గుగ్గుళ్ళు ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### గురు గ్రహ శాంతి విధానము

పూర్వాభాద్రా నక్షత్రము రోజున లేదా గురువారము రోజు తెల్లవారుజామున 1.30 ని॥ల నుండి 3.00 గం॥లోపు శనగలు ఉడికించి శనగగుగ్గిళ్ళుగా చేసి జాతకుడు నైఋతి దిశాభిముఖంగా కూర్చుని, శనగగుగ్గుళ్ళు తొమ్మిది సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన శనగగుగ్గుళ్ళు ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

### కేతువు గ్రహ శాంతి విధానము

ఉత్తరాషాఢ, శ్రవణ, చిత్త, పూర్వాభాద్ర నక్షత్రములు వచ్చిన రోజున లేదా ఆది, సోమ, మంగళ, గురువారము రోజున తెల్లవారు జామున 1.30 ని॥ల నుండి 3.00 గం॥లోపు ఉలవలను ఉడికించి ఉలవ గుగ్గుళ్ళుగా చేసి జాతకుడు నైఋతి దిశాభిముఖంగా కూర్చుని, ఉలవ గుగ్గుళ్లను ఎనిమిది సార్లు దిగదీయించుకొని, ఆ దిగదీసిన ఉలవ గుగ్గుళ్ళును ఎర్రని లేదా తెల్లని ఆవుకు తినిపించాలి.

## నవనాయక & పశుపాలక, గోప్తప్రాపక, గోప్త బహిష్కర్త నిర్ణయము(2009-10 నుండి 2025-26)

| తెలుగు సం॥ | రాజు | మంత్రి | సేనాధిపతి | సస్యాధిపతి | ధాన్యాధిపతి | అర్ఘాధిపతి | మేఘాధిపతి | రసాధిపతి | నీరసాధిపతి | పశుపాలక | గోప్తప్రాపక | గోప్తబహిష్కర్త |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| విరోధి | శుక్ర | చంద్ర | రవి | గురు | కుజ | రవి | చంద్ర | శని | గురు | శుక్ర | చంద్ర | రవి |
| వికృతి | కుజ | బుధ | కుజ | శుక్ర | గురు | కుజ | కుజ | రవి | శుక్ర | కుజ | కుజ | కుజ |
| ఖర | చంద్ర | గురు | బుధ | శని | శుక్ర | బుధ | బుధ | చంద్ర | శని | చంద్ర | బుధ | బుధ |
| నందన | శుక్ర | శుక్ర | గురు | చంద్ర | శని | గురు | గురు | బుధ | చంద్ర | శుక్ర | గురు | గురు |
| విజయ | గురు | శని | శుక్ర | కుజ | రవి | శుక్ర | శని | గురు | కుజ | గురు | శని | శుక్ర |
| జయ | చంద్ర | చంద్ర | రవి | బుధ | కుజ | రవి | రవి | శుక్ర | బుధ | చంద్ర | రవి | రవి |
| మన్మధ | శని | కుజ | చంద్ర | గురు | బుధ | చంద్ర | చంద్ర | శని | గురు | శని | చంద్ర | చంద్ర |
| దుర్ముఖి | శుక్ర | బుధ | కుజ | శని | గురు | కుజ | కుజ | చంద్ర | శని | శుక్ర | కుజ | కుజ |
| హేవళంబి | కుజ | గురు | బుధ | రవి | రవి | బుధ | గురు | కుజ | రవి | కుజ | గురు | బుధ |
| విళంబి | రవి | శని | శుక్ర | చంద్ర | రవి | శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | రవి | శుక్ర | శుక్ర |
| వికారి | శని | రవి | శని | కుజ | చంద్ర | శని | చంద్ర | శుక్ర | కుజ | శని | చంద్ర | శని |
| శార్వరి | బుధ | చంద్ర | రవి | గురు | కుజ | రవి | రవి | శని | గురు | బుధ | రవి | రవి |
| ప్లవ | కుజ | కుజ | చంద్ర | శుక్ర | బుధ | కుజ | కుజ | రవి | శుక్ర | కుజ | కుజ | కుజ |
| శుభకృత్ | శని | గురు | బుధ | శని | శుక్ర | బుధ | బుధ | చంద్ర | శని | శని | బుధ | బుధ |
| శోభకృత్ | బుధ | శుక్ర | గురు | రవి | శని | గురు | శని | కుజ | రవి | బుధ | శని | గురు |
| క్రోధి | కుజ | శని | శుక్ర | కుజ | రవి | శుక్ర | శుక్ర | గురు | కుజ | కుజ | శుక్ర | శుక్ర |
| విశ్వావసు | రవి | రవి | శని | బుధ | చంద్ర | రవి | రవి | శుక్ర | బుధ | రవి | రవి | రవి |

## రాజాధి నవనాయక నిర్ణయం

| | | | |
|---|---|---|---|
| 1. | చాంద్రమాన సంవత్సర వారాధిపతి | – | రాజు |
| 2. | మేష సంక్రమణ వారాధిపతి | – | మంత్రి |
| 3. | సింహ సంక్రమణ వారాధిపతి | – | సేనాధిపతి |
| 4. | కర్కాటక సంక్రమణ వారాధిపతి | – | సస్యాధిపతి |
| 5. | ధనస్సు సంక్రమణ వారాధిపతి | – | ధాన్యాధిపతి |
| 6. | మిథున సంక్రమణ వారాధిపతి | – | అర్ఘ్యాధిపతి |
| 7. | రవి ఆరుద్రా నక్షత్రా ప్రవేశ వారాధిపతి | – | మేఘాధిపతి |
| 8. | తులా సంక్రమణ వారాధిపతి | – | రసాధిపతి |
| 9. | మకర సంక్రమణ వారాధిపతి | – | నీరసాధిపతి |

## పశుపాలక నిర్ణయం

1. రవి, కుజులు రాజులుగానున్న సంవత్సరం పశు నాయకత్వం యమునికి కలుగును.
2. బుధ, శనులు రాజులుగనున్న సంవత్సరం పశునాయకత్వం బల భద్రునికి (బలరాముడు) కలుగును.
3. గురు, శుక్ర, చంద్రులు రాజులుగనున్న సంవత్సరం పశునాయకత్వం గోపాలునికి కలుగును.

## గోష్టప్రావక నిర్ణయం

1. రవి కుజులు మేఘాధిపతిలయిన యముడు
2. బుధ శనులు మేఘాధిపతి అయిన బలభద్రుడు (బలరాముడు)
3. గురు, శుక్ర, చంద్రులు మేఘాధిపతి అయిన శ్రీకృష్ణుడు గోష్టప్రావకులు అగుదురు.

### గోష్ట బహిస్కర్త నిర్ణయము

1. రవి కుజులు అర్ఘ్యాధిపతి అయిన యముడు
2. బుధ శనులు అర్ఘ్యాధిపతి అయిన బలభద్రుడు (బలరాముడు)
3. గురు, శుక్ర, చంద్రులు అర్ఘ్యాధిపతి అయిన శ్రీకృష్ణుడు గోష్ట బహిష్కర్తలు అగుదురు.

## నవనాయకులు

### రవికి నవనాయకత్వం కలిగిన ఇచ్చు ఫలములు

శ్లో॥ అన్యోన్యవైరం క్షితిపాలకానాం నాత్యంబు ముంచంతి బలహకాశ్చ ।
భూపాద్భయం శస్త్ర భయం నరాణాచోరాగ్ని బాధాబ్దపతౌదినేశే ॥

తా ॥ రవి రాజైన రాజవైరం, మేఘ సమవృష్టి, ప్రజలకు, రాజునకు శస్త్ర చోరాగ్నుల భయం అధికమగును.

శ్లో॥ రాజ్ఞా మన్యోన్య వైరత్వ మనావృష్టిర్నిరంతరం
అధర్మ నిరతామర్త్యాః భాస్కరస్యచ మంత్రితః ॥

తా ॥ రవి మంత్రియైన రాజ విరోధములు, అనావృష్టి, ప్రజలు అధర్మపరులు అగుట జరుగును.

శ్లో॥ అన్యోన్య యుద్ధం ధరణీశ్వరాణా మల్పాంబుదావారిధరాస్సవాతాః ।
రక్తానిధాన్యాని ఫలంతి భూమౌసేనాధిపత్యే దివసేశ్వరస్య ॥

తా ॥ రవి సేనాని అయితే రాజవైరం, వాయు పీడనంచే అల్ప వృష్టి, రక్త ధాన్య సమృద్ధి ఉండును.

శ్లో॥ గోధూమ యవ ముఖ్యాని కుళుత్థ చణ కానిచ ।
సమృద్ధాని భవిష్యంతి రవౌ సస్యాధినాయకే ॥

తా ॥ రవి సస్యాధిపతి అయిన గోధుమలు, యవలు, ఉలువలు, శెనగలు మొదలైన ధాన్యములు పరిపూర్ణంగా పండును.

శ్లో॥ మధ్యవృష్టిః ఫలం స్వల్ప మనర్ఘంచ మహద్భయం
రక్తస్యాని జాయంతె సూర్యే ధాన్యాధిపతే ॥

తా ॥ రవి ధాన్యాధిపతి అయిన మధ్యవృష్టి, పాడిపంటలు తక్కువ అగుట ధరలు తగ్గుట, మహాభయం, రక్త వర్ణ ధాన్యం పరిపూర్ణంగా పండుట జరగును.

శ్లో॥ అనర్ఘమల్ప వృష్టించ ప్రజానాం క్షుద్భయంతథా
రాజ్ఞాం పరస్పర క్రోధస్సూర్యేచార్ఘ పతౌసతి ॥

తా॥ రవి అర్ఘ్యాధిపతి అయిన ధరలు తగ్గును. స్వల్పవృష్టి, ప్రజలకు ఆకలిబాధలు, రాజ విరోధములు కలుగును.

శ్లో॥ మహాద్భయం ఫలం స్వల్పం వర్షంస్యాత్ఖండ మంతరే ।
రక్త సస్యంసు ఫలితం సూర్యే మేఘాధిపేసతి ॥

తా॥ రవి మేఘాధిపతి అయిన స్వల్ప పంటలు, భయము, ఖండవృష్టి కలిగి రక్త ధాన్యము పండును.

శ్లో॥ తిల తైల గుడక్షారాద్యనేకర సజాతయంః ।
శూన్యార్ఘం యాంతితే సర్వే రవౌయదిర సాధిపే ॥

తా॥ రవి రసాధిపతి అయిన నువ్వులు, నూనె, బెల్లం, ఉప్పు మొదలగు రస వస్తువుల ధరలు తగ్గును.

శ్లో॥ నీరసాధిపతౌ సూర్యే తామ్ర చందన యోరపి ।
రత్న మాణిక్య ముక్తానాం జాయతే వృద్ధి రుత్తమా ॥

తా॥ రవి నీరసాధిపతి అయిన రాగి, శ్రీగంధం, రత్న మాణిక్య ముత్యములు సమృద్ధిగా ఉండును.

### చంద్రునికి నవనాయకత్వములు కలిగిన ఇచ్చు ఫలములు

శ్లో॥ గోధూమ శాలీక్షుమతీ ధరిత్రీ యూపైర్విచిద్రాధ్వర వేదనాదైః ।
విభాంతిగావః పయసావిశిష్టాః దుగ్ధాబ్ధిజేవర్ష పతౌశశాంకె ॥

తా॥ చంద్రుడు రాజైన భూమి నందు గోధుమలు, వరి, చెఱకు పండును. యజ్ఞ యాగాదులధికము, యజ్ఞముచే వేదనాదము అధికమగును. గోవులు సమృద్ధిగా పాలు ఇచ్చును.

శ్లో॥ సువృష్టి స్సర్వ సస్యాని ఫలితాని భవంతిచ ।
క్షేమారోగ్యం సుభిక్షంస్యాచ్చ శాంకేసచివేసతి ॥

తా॥ చంద్రుడు మంత్రి అయిన సువృష్టి, అన్ని పంటలు బాగుగా పండుట, క్షేమారోగ్య సుభిక్షములు కలుగును.

శ్లో॥ జలధాన్యాని నర్వాణి స్థల ధాన్యాని యానిచ ।
వృక్ష సస్యాభి వృద్ధి స్యా చ్చంద్రే సస్యాధిపేసతి ॥

తా ॥ చంద్రుడు సస్యాధిపతి అయిన నీటి ద్వారా పండే పంటలు (మాగాణి) మెట్ట పంటలు బాగా ఫలించును. చెట్లకు సస్యములకు వృద్ధి కలుగును.

శ్లో॥ అతి వర్షమతీ వార్ఘమరో గాస్సుఖినో జనాః ।
బహుక్షీర ప్రదాగావశ్చంద్రే సేనాధిపతేసతి ॥

